# మదర్ థెరిసా మాయాజాలం



## ధర్మజాగరణ సమితి
ఆంధ్రప్రదేశ్

# ముందుమాట

**మదర్ థెరిసా, సోదరి నివేదిత, అనిబిసెంట్....** ఈ మూడు పేర్లు చెపితే పట్టణంలో విద్యావంతుడు, గ్రామంలో నిరక్షరాస్యుడితో సహా ఎక్కువమంది గుర్తుపట్టే పేరు మదర్ థెరిసా. ఆ పేరు చెప్పగానే కుష్టురోగి, కాన్సర్ బాధితుడిని ఆప్యాయంగా తలనిమురుతున్న 'మదర్' గుర్తుకు వస్తుంది. నిస్వార్థ సేవకు మారురూపంగా కళ్ళ ముందు కదలాడు తుంది. మదర్ థెరిసా సేవకు, ప్రేమకు, నిస్వార్థతకు ఎంత ప్రచారం ఉందంటే - సినిమాలో ముసలిపాత్ర ' నామాట వినకపోతే నా ఆస్తిని మదర్ థెరిసా ఆశ్రమానికి రాసి ఇచ్చేస్తా' అనే డైలాగు చెపితే రూపాయి క్లాసులో కూర్చున్న జనం చేత కూడా చప్పట్లు కొట్టించి, ఈలలు వేయించేటంత ప్రచారం ఉంది. నీ ఆదర్శం ఎవరంటే 'మదర్ థెరిసా' అని వర్థమాన నటి చేత ఠక్కున చెప్పించేటంత ప్రచారం ఉంది. కొత్తగా పుట్టిన రాజకీయపార్టీ తన ప్రచార పోస్టర్లలో గాంధీగారి బొమ్మపక్కనే మదర్ థెరిసా బొమ్మను తప్పనిసరిగా ముద్రించేటంత ప్రచారం ఉంది. హిందువులు స్థాపించి, నడివే తొంభైశాతం ఆస్పత్రుల్లో, క్లినిక్కుల్లో, వృద్ధాశ్రమాల్లో, అనాథశరణాలయాల్లో ప్రవేశ ద్వారానికి ఎదురుగాపెద్ద థెరిసా బొమ్మ పెట్టడం ఒక ఆచారంగా మార్చేంత ప్రచారం ఉంది. ఇవన్నీ చాలక మదర్ థెరిసా గురించి ప్రచారం చెయ్యడంలో ప్రభుత్వాలు కూడా ఏమాత్రం తీసిపోలేదు. ఆ మధ్య ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం థెరిసా జీవితచరిత్రను పదవతరగతి విద్యార్థులకు తెలుగు ఉపవాచకంగా (నాన్ డిటెయిల్డ్) పెట్టి పిల్లల బుర్రల్లోకి ఎక్కించే ప్రయత్నం చేసింది. నిజానికి **మదర్ థెరిసా అంతటి నిస్వార్థ సేవాస్వరూపిణా? ఆపదలో ఉన్న వారిని ఆదుకోవడానికి పరుగుపరుగునవెళ్లిన అభయహస్తమా? కుష్టురోగులు, కాన్సర్ బాధితులు, అనాథలను అక్కునచేర్చుకున్న కారుణ్యమూర్తా?**

ఆధునిక పోటీ ప్రపంచంలో నిత్యం పరుగులు పెట్టి అలసిపోతున్న ప్రజానీకానికి దేని గురించైనా నిజానిజాలు తెలుసుకోవాలనే ఆలోచన, తీరిక, ఓపిక ఉండవు. పత్రికల ద్వారానే ప్రపంచాన్ని తెలుసుని, ఆ ప్రపంచమే నిజమనుకుని కాలం వెళ్ళదీసే వారికి మదర్ థెరిసా కారుణ్యమూర్తి, సేవా స్వరూపిణే. కానీ ఆమె ప్రధాన కేంద్రంగా పనిచేసిన కోల్‌కత్తాలోనే ప్రజలు ఆమెను, ఆమె సంస్థ - మిషనరీస్ ఆఫ్ ఛారిటీని పెద్దగా పట్టించుకోరనే సత్యం చాలామందికి

తెలియదు. ఎందుకంటే నిజానికి అక్కడ ఆమె పెద్దగా పని చేసిందేమీ లేదు. అక్కడేకాదు, ప్రపంచంలో మరెక్కడా థెరిసా చేసిన సేవ పెద్దగా ఏమీలేదు. ఆ మాట థెరిసాయే స్వయంగా చెప్పుకున్నారు. తాను 'సామాజిక కార్యకర్త'ను కానని, మత ప్రచారమే తన పరమలక్ష్యమని ఆమె అనేకసార్లు బాహాటంగానే చెప్పారు. పైగా ఏడాదిలో సగానికిపైగా విదేశీ పర్యట నలు, ఆ పర్యటనల్లో సంపన్నులు, పరపతి కలిగిన వారితో సమావేశాలు, 'ప్రార్థన'ల్లో బిజీగా గడిపిన మహిళ చేయగలి గిన ప్రజాసేవ ఏముంటుంది? కానీ మరి ఇలా ఏమీ చేయకపోయినా ఎంతో చేసినట్లు పేరు ఎలా వచ్చింది? ఆమె గురించి ఎప్పుడూ, ఏమీ తెలుసుకోని, తెలుసుకునేందుకు ప్రయత్నించని వారు కూడా ఆమెను గురించి ఏమన్నా తీవ్రంగా ప్రతిస్పందించడానికి కారణం ఏమిటి? ఎంతోకొంత చేయకపోతేనే ఇంత పేరు వచ్చిందా... అంటూ ఎదురు ప్రశ్నలు వేయడానికి కారణం ఏమిటి? అదే మదర్ థెరిసా మాయ. అదే ఆమె వెనకనున్న కాథలిక్ చర్చ్ మీడియా మాయ. **ఈ మాయను క్రిస్టఫర్ హిచెన్స్ 'హెల్స్ ఏజెల్' అనే డాక్యుమెంటరీలో బయటపెట్టారు. ఈ డాక్యువెంటరీతో పాటు అనేక ఇతర వీడియోలు ఇంటర్‌నెట్‌లో లభ్యమవుతున్నాయి.** (http://www.hindujagruti.org/news/10261.html) (youtube)

ఆ మాయ స్వరూపం ఏమిటో ముందు పేజీల్లో చూద్దాం.....

**- ప్రకాశకులు**

<u>విషయ సూచిక</u>

అధ్యాయం 1

# మదర్ థెరిసా మరోవైపు

**ఆపన్నులను ఆదుకునేందుకు పరుగుపరుగున వస్తుంది.....'**

ఇదీ మదర్ థెరిసా గురించి చాలామందిలో ఉన్న అభిప్రాయం. నిజానికి థెరిసా అలా బాధల్లో ఉన్నవారి కోసం అంతగా తాపత్రయపడ్డారా? పరుగులు పెట్టారా? అంటే లేదనే చెప్పాలి. దేశంలోని వివిధ ప్రాంతాలేకాదు ఆమె ప్రధాన కేంద్రంగా పనిచేసిన కోల్‌కత్తాలో కూడా ప్రజల కష్టాలు, బాధలు ఆమె పట్టించుకోలేదు. భోపాల్ గ్యాస్ దుర్ఘటన, లాతూర్ భూకంపం, కోల్‌కత్తా చుట్టుపక్కల ప్రాంతాల్ని తరచు ముంచెత్తిన వరదలు... ఇలా ఏ సందర్భంలోనూ మదర్ థెరిసా బాధితుల్ని ఆదుకున్న దాఖలాలు లేవు. అయినా అన్నింటిలోనూ ప్రజల్ని అక్కున చేర్చుకుని, కన్నీళ్ళు తుడిచిన మానవతామూర్తిగా, కారుణ్యరూపంగా పేరు మాత్రం సంపాదించుకున్నారు.

సెప్టెంబర్, 1995... పశ్చిమబెంగాల్‌లో పలు ప్రాంతాల్ని వరదలు ముంచెత్తాయి. సరిగ్గా దసరా దుర్గా ఉత్సవాలకు ముందు వచ్చిన ఈ వరదల్లో వందలాదిమంది చనిపోయారు. వేలాదిమంది ఇళ్ళువాకిళ్ళు కోల్పోయి నిరాశ్రయులుగా మిగిలారు. కోటిన్నర పైగా ఆస్తి నష్టం వాటిల్లింది. కోల్‌కతా చుట్టు పక్కల గ్రామాలు కూడా వరద తాకిడికి గురయ్యాయి. బాధితులకు సాయం చేయడం కోసం అనేక స్వచ్ఛంద సంస్థలు ముందుకు వచ్చాయి. ఇనిస్టిట్యూట్ ఆఫ్ హైజీన్, ఉమన్స్ కో ఆర్డినేషన్ కమిటీ తదితర సంస్థలు విరాళాలు సేకరించాయి. సెప్టెంబరులో మొదలైన సహాయ కార్యక్రమాలు ఆరు నెలలపాటు సాగుతూనే ఉన్నాయి. కోల్‌కతాలో సెక్స్‌వర్కర్లు కూడా బాధితుల కోసం విరాళాలు సేకరించారు- 'మా తోటి వారు బాధల్లో ఉంటే చూస్తూ ఎలా ఊరుకోగలం? మాకూ మానవత్వం ఉంది' అని వాళ్ళన్నారు. సాధారణ జనం నుంచి స్వచ్ఛంద సంస్థల వరకూ అంతా వరద బాధితులను ఆదుకునేందుకు ప్రయత్నించారు. కానీ ఒకే ఒక సంస్థ మాత్రం ఈ సహాయకార్యక్రమాల్లో పాలుపంచుకోలేదు. అదే మదర్ థెరిసా ఆధ్వర్యంలో నడిచే మిషనరీస్ ఆఫ్ ఛారిటీ. బాధితుల కోసం విరాళాలు సేకరించడానికి సెక్స్‌వర్కర్లు సైతం ముందువచ్చినా, మదర్ థెరిసా మాత్రం అమెరికా పర్యటనలో 'బిజీ'గా ఉన్నారు.

ఆ మరుసటి ఏడాది మళ్ళీ వరదలు అతలాకుతలం చేశాయి. ఈసారి ఉత్తర జిల్లాలు ముంపుకు గురయ్యాయి. మళ్ళీ రామకృష్ణ మిషన్, భారత సేవాశ్రమ సంఘం వంటి సంస్థలు సహాయ కార్యక్రమాలు చేపట్టాయి. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ మాత్రం అటువైపు చూడనైనా లేదు. ఇలా వరుసగా రెండేళ్ళపాటు వచ్చిన వరదల్లో సహాయం ఊసెత్తని మదర్ థెరిసా వార్తాపత్రికలకు ఇంటర్వ్యూలు మాత్రం ఇచ్చారు. 'రాత్రిపగలు లేకుండా 'సిస్టర్లు' వరదబాధితులకు సేవ చేశారు' అని గొప్పగా చెప్పుకున్నారు. ఆ ఇంటర్వ్యూలు చదివితే మదర్‌ది ఎంతటి జాలి గుండె కదా...మిషనరీస్ ఆఫ్ ఛారిటీ లేకపోతే వరద బాధితులు ఏమయ్యేవారో కదా..అనిపిస్తుంది! ఏభై ఏళ్ళలో కనీసం పన్నెండుసార్లైనా వరదలు కోల్‌కతా చుట్టుపక్కల ప్రాంతాల్ని ముంచెత్తాయి. ఒక్కసారి తప్పితే మరెప్పుడూ బాధితులకు సహాయం చేయడానికి మిషనరీస్ ఆఫ్ చారిటీ ముందుకు రాలేదు. కానీ ఆ ఒక్కటీ చాలన్నట్లు 'రాత్రిపగలు లేకుండా సేవ' చేశారనే ప్రచారం మాత్రం లభించింది.



కోల్‌కతా ధ్వరపాడా మురికివాడలో షహిదా అనే 16 ఏళ్ళ అమ్మాయి ఉండేది. అక్కడకు దగ్గరలోనే మదర్ థెరిసా ప్రేమ్‌దాన్ సెంటర్ కూడా ఉంది. జూలై 13, 1995న కుటుంబ తగాదాలో షహిదా మీద కిరోసిన్ పోసి అంటించారు. తీవ్రమైన గాయాలతో కొనఊపిరితో ఉన్న షహిదాను ఆస్పత్రిలో చేర్చేందుకు కూడా ఎవరూ ముందుకు రాలేదు. ప్రభుత్వఆస్పత్రిలో బెడ్ కూడా దొరకలేదు. చివరికి ఎలాగోలా చేరినా గాయాలు మానకుండానే మూడువారాలకు ఆమెను డిశ్చార్జ్‌చేశారు. దీనితో దిక్కుతోచని షహిదా కోల్‌కతా మున్సిపల్ కార్పొరేషన్ ఆఫీస్ బయట ధర్నా మొదలుపెట్టింది. కొన్ని వారాలు ధర్నా చేసినా ఎవరూ పట్టించుకోలేదు. గాయాలకు ఇన్‌ఫెక్షన్ సోకి పరిస్థితి విషమంగా మారింది. సహాయం చేయమని షహిదా అనేక సంస్థల్ని కోరింది. మదర్ థెరిసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి కూడా విజ్ఞప్తి చేసింది. కానీ షహిదాకి ఒక కుటుంబం ఉంది కాబట్టి, ఆమె 'అనాథ' కాదు కాబట్టి సహాయం చేయలేమని మొండి చెయ్యి చూపారు థెరిసా సంస్థవారు. సకాలంలో చికిత్స అందక షహిదా చనిపోయింది. ఆమె పరిస్థితి చూసి సాధారణ ప్రజానీకం సహాయం చేశా రేమో కానీ, 'సిస్టర్లు' మాత్రం కరగలేదు. సహాయం అడుగుతున్నవారు ఎంత కష్టంలో ఉన్నారన్నది పట్టించుకోకుండా, వారు అనాథలు

అవునా, కాదా అని తర్కించడం, పరిశీలించడం ఛారిటీ సంస్థ పద్ధతి. 'కుటుంబం' ఉన్నవారికి ఎలాంటి రాయితీ, సహాయం అందకుండా ఛారిటీ సిస్టర్స్ ఎంతో జాగ్రత్తపడేవారు!

+++

డిసెంబరు, 1984..భోపాల్‌లో యూనియన్ కార్బైడ్ కంపెనీ నుంచి వెలువడిన విషవాయువు వేలాదిమందిని పొట్టన పెట్టుకుంది. రాత్రి నిద్రలో ఉన్నవారు ఉన్నట్టేకన్నుమూశారు. ప్రపంచంలోనే అతిఘోరమైన పారిశ్రామిక ప్రమాదాల్లో ఒకటైన ఈ దుర్ఘటనలో మరికొన్ని వేలమంది వికలాంగులుగా మారారు. విషవాయువు ప్రభావం తరతరాలుగా ఉంటుందని నిపుణులు తేల్చారు. ఇంతటి అపదకు గురైన ప్రజల్ని ఆదుకునేందుకు మదర్ థెరిసా అడుగు కూడా కదపలేదు. అప్పటికే నోబెల్ బహుమతి పొంది అపారమైన కీర్తి మూటకట్టుకున్న థెరిసా ఒక 'అంతర్జాతీయ అతిథి'లా భోపాల్‌ను సందర్శించారు. ప్రమాదానికి కారణమైన ఫ్యాక్టరీని చూసి, ప్రజలకు వచ్చిన కష్టం, జరిగిన నష్టం తెలుసుకున్నతరువాత మదర్ థెరిసా ఒకే ఒక మాట అన్నారు - 'క్షమించేయండి'. చుట్టూఉన్నవారంతా నిర్ఘాంతపోయారు. ఇంత కష్టంలో ఉన్న తమకు సహాయం చేస్తుందని ఎదురుచూస్తే 'క్షమించేయండి' (కార్బైడ్ నేరస్తులనా?) అంటూ సందేశమిచ్చి వెళిపోవడం వారికి మింగుడుపడలేదు. కానీ ఈ 'పర్యటన' గురించి థెరిసా ప్రచార యంత్రాంగం మాత్రం అద్భుతమైన రిపోర్ట్ పత్రికలకు పంపింది -

"కలకత్తా ప్రజల్ని ఆదుకున్నట్లే భోపాల్ బాధితుల్ని అక్కున చేర్చుకునేందుకు మదర్ థెరిసా అక్కడకు వెళ్ళారు. ఎంతోకాలంగా భోపాల్‌లో పనిచేస్తున్న మిషనరీస్ ఆప్ ఛారిటీ బృందాలు బాధితులకు సహాయ కార్యక్రమాలు చేపట్టాయి. మదర్ థెరిసా బాధితులను కలిశారు. ఘోర ప్రమాదానికి గురైన వారికి సహాయాన్ని, ప్రేమను అందించడానికే వచ్చామని థెరిసా వారికి చెప్పారు. పలు ఆస్పత్రులు, సహాయ కేంద్రాలను సందర్శించారు ".

ఈ రిపోర్టే అన్ని పత్రికల్లోనూ ప్రచురితమైంది. అయితే ఆ రిపోర్ట్‌లోని మాటలగారడీ, అతిశయోక్తులు, అబద్ధాలు మాత్రం ఎవరికీ తెలియలేదు. రిపోర్ట్‌లో చెప్పిన 'మిషనరీస్ ఆఫ్ ఛారిటీ బృందాలు' అంటే థెరిసాతోపాటు ప్రైవేటు విమానంలో భోపాల్ వెళ్ళిన కొద్దిమంది సిస్టర్లు అన్నమాట. 'ఎంతోకాలంగా భోపాల్‌లో పనిచేయడం..' అంటే ఒక చిన్న (కోల్‌కతాలో ఉన్న నిర్మల్ హృదయ్

వంటి) అనాధాశ్రమాన్ని నిర్వహించడం. ఇలా మాటల గారడీతో, అసత్యాల ఆర్భాటంతో జనాన్ని మభ్యపెట్టడం, మాయ చేయడమే మదర్ థెరిసా ప్రచార యంత్రాంగపు పని. ఈ ప్రచారం అక్కడితో  ఆగలేదు. భోపాల్ బాధితులకు ఎంతో సహాయం చేసినట్లు పేర్కొంటూ థెరిసా జీవిత చరిత్రలో ఒక ఫోటో కూడా ప్రచు రించారు. ఫోటోలో చికిత్స పొందున్న ఒక బాధితురాలికి 'ప్రేమ'గా పువ్వు అందిస్తున్న మదర్ థెరిసా, దానికింద 'బాధి తురాలికి 'సహాయం' అందిస్తున్న మదర్ థెరిసా ' అని కాప్షన్! ఇదేం రకం సహాయమో?

+++

సెప్టెంబరు 30, 1993...మహారాష్ట్రలోని లాతూర్‌లో భయంకర భూకంపం. ఎనిమిది వేలమంది చనిపోయారు. 50  లక్షల మంది ఇళ్ళువాకిళ్ళు కోల్పోయారు. రెండువందల స్వచ్ఛంద సంస్థలు సహాయ కార్యక్రమాలు ప్రారంభించాయి. వాటిలో కొన్ని అప్పటి నుంచి ఇప్పటి వరకూ పునరావాస కార్యక్రమాలు చేస్తూనే ఉన్నాయి. ప్రభుత్వం 80 కోట్ల రూపాయలతో సహాయనిధి ఏర్పాటుచేసింది. ఇంత ఘోరప్రమాదం జరిగినా బాధితుల్ని ఆదుకునేందుకు మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ముందుకు రాలేదు. ఇక్కడేకాదు, అక్టోబరు 20, 1991న ఉత్తరాఖండ్‌లో కొండచరియలు విరిగిపడిన దుర్ఘటనలో  కూడా బాధితులను ఆదుకునేందుకు మదర్ కదలిరాలేదు. జనవరిలో లాతూర్‌లో పునరావాస కార్యక్రమాలు ప్రారంభమైనప్పుడూ మదర్ వాటికి దూరంగానే ఉండిపోయారు. అంతేకాదు సహాయ కార్యక్రమాలు జోరుగా సాగుతుంటే ఆమె  అమెరికా పర్యటనకు వెళ్ళారు. అది కూడా అలెగ్జాండర్ లోస్ (Alexander Loce) అనే తన మిత్రుడి తరపున అమెరికా సుప్రీంకోర్టులో పిటిషన్ వేసేందుకు. తన మాజీ ప్రేయసి అవాంఛిత గర్భాన్ని తీయించుకోకుండా అడ్డుపడినందుకు కేసులో ఇరుక్కున్న అలెగ్జాండర్‌ను ఆదుకోవడమే తక్షణ కర్తవ్యంగా మదర్‌కు కనిపించింది. అందుకే లాతూర్ బాధితుల్ని పట్టించుకోకుండా పరుగుపరుగు అమెరికా వెళ్ళారు. కాలిన గాయాలతో కోల్‌కతా మున్సిపల్ ఆఫీసు  ముందు ధర్నా చేస్తూ ప్రాణాలు వదిలిన షహిదాకు సహాయం చేయని మదర్ థెరిసా అబార్షన్ కేసులో ఇరుక్కున్న మిత్రుడి తరపున పిటిషన్ వేయడానికి అమెరికా వెళ్ళగలిగారు. ఇదే విషయాన్ని అమెరికా 'నేషనల్ కాథలిక్ రిపోర్టర్' అనే పత్రికసంపాదకుడు  మైకెల్ జె. ఫారెల్ (Michael J Farrell) ప్రస్తావిస్తే అతని నోరు మూయించారు. బహుశా పేద ముస్లిం కూలీ కంటే సంపన్న అమెరికా మిత్రుడి  'కష్టం' పెద్దదని మదర్ థెరిసా భావించి ఉంటారు.

లాతూర్ బాధితుల కోసం వరల్డ్ బ్యాంక్ ఇచ్చిన రెండువందల కోట్ల డాలర్ల నిధిని దుర్వినియోగం చేశారంటూ అప్పట్లో ప్రభుత్వంపై అనేక ఆరోపణలు, విమర్శలు వచ్చాయి. కానీ బ్యాంకుల్లో మురుగుతున్న తమ కోట్లాది డాలర్ల నిధుల్లో మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ఒక్క పైసా కూడా ఎందుకు బయటకు తీయలేదని మాత్రం ఎవరూ ప్రశ్నించలేదు. పైగా వరల్డ్ బ్యాంక్ నిధులతో కట్టిన ఇళ్ల పట్టాలను మదర్ థెరిసా ద్వారా బాధితులకు అందజేశారు. 1994 అక్టోబరులో మరొక 'స్పిరిచ్యువల్' యాత్ర కోసం థెరిసా బయలుదేరారు. ప్రార్థన, సేవ, శిశుసంరక్షణ 'సందేశాలు' వినిపించడంతో పాటు నిధుల సేకరణ (ఈ సంగతి మాత్రం బయటకి చెప్పరు) ఈ యాత్ర లక్ష్యం. మొదట వాటికన్ దర్శనం కోసం బయలుదేరిన థెరిసా ముంబై వచ్చారు. ప్రపంచబ్యాంకు నిధులు దుర్వినియోగం అవుతున్నాయనే విమర్శలు వచ్చిన నేపథ్యంలో వాటి నుంచి బయటపడడమేకాక, 'అంతర్జాతీయ గుర్తింపు' పొందవచ్చని ఆలోచించిన ప్రభుత్వాధికారులు లాతూర్ బాధితుల కోసం కట్టిన ఇళ్ళను థెరిసా ద్వారా బాధితులకు అందజేయాలని భావించారు. కానీ ఈ పంపిణీ కార్యక్రమాన్ని చూసిన వారు మాత్రం మదర్ థెరిసాయే ఆ ఇళ్ళు కట్టించి ఇస్తున్నారని అనుకున్నారు. అంతర్జాతీయ కాథలిక్ మీడియా ఈ అవకాశాన్ని బాగా ఉపయోగించుకుని మరింత ప్రచారం చేసింది. గ్రామస్థులకు ఎంతో ఆప్యాయంగా ఇళ్ల పట్టాలు పంచుతున్న థెరిసా ఫోటోలు, వాటికింద 'సేవలో మరో రోజు' అంటూ క్యాప్షన్లతో సహా ప్రచురితమయ్యాయి. సొమ్ము వరల్డ్ బ్యాంకు, భారత ప్రభుత్వానిది, సోకు మాత్రం మదర్ థెరిసాది! లాతూర్ బాధితులకు మిషనరీస్ ఆఫ్ ఛారిటీ చేసింది ఏమీలేకపోయినా ఎంతో ప్రచారం, మరెంతో పేరు వచ్చాయి. నిజానికి వారికోసం ఎన్నో పునరావాస కార్యక్రమాలు చేసిన రామకృష్ణమిషన్ వంటి సంస్థల పేరు అసలు వినిపించనేలేదు. అదే మదర్ థెరిసా మీడియామాయ.



భోపాల్, లాతూర్ దుర్ఘటనలేకాదు, కోల్‌కతాలో ఏ ప్రమాదం జరిగినా మదర్ థెరిసా ముందుకు కదిలి సేవ చేసిన దాఖలాలు లేవు, కేవలం బాధితులు, మరణించిన వారికోసం ప్రార్థనలు తప్ప. అలా ప్రార్థనలు చేయడమే గొప్ప సేవ అన్నట్లు ప్రచారం మాత్రం తప్పక జరిగేది. 20, ఆగస్ట్, 1995న ఫిరోజ్‌పూర్ రైలు ప్రమాదంలో 200 మంది చనిపోయారు. తన పుట్టినరోజు సందర్భంగా జరిగిన ప్రత్యేక ప్రార్థనలో మృతులకు ఆత్మశాంతి కలగాలని కోరుకోవడంతప్ప మదర్ థెరిసా చేసిందేమీ లేదు. ఇంకా వెనక్కి వెళితే .... 1979లో నోబెల్ బహుమతి

అందుకున్న తరువాత మదర్ థెరిసా గౌరవార్థం ఒక సన్మానసభ ఏర్పాటైంది. అదే రోజున జాంగీర్‌పూర్ దగ్గర హుగ్లీ నదిలో రైలుపడి 300 మంది చనిపోయారు. ప్రమాదం గురించి సభలో మదర్ థెరిసా కనీసం ప్రస్తావన కూడా చేయలేదు. 11 సెప్టెంబరు, 1995 కోల్‌కతాకు 60 కి.మీ దూరంలో ఉన్న హౌరా జిల్లాలో బాణసంచా ఫ్యాక్టరీలో పెద్ద పేలుడు జరిగింది. అందులో పని చేస్తున్న 22 మంది పిల్లలతో సహా చాలా మంది చనిపోయారు. ఆ ప్రాంతంలోనే పెద్ద సెంటర్ ఉన్న మిషనరీస్ ఆఫ్ చారిటీ కానీ, మిషనరీ బ్రదర్స్ ఆఫ్ ఛారిటీ కానీ బాధితుల్ని ఆదుకునేందుకు ముందుకు రాలేదు. 1995 క్రిస్మస్ రోజున ఢిల్లీ దగ్గర మండీ దబ్వాలీలో ఘోర అగ్నిప్రమాదం జరిగింది. స్కూలు వార్షికోత్సవంలో ఉత్సాహంగా పాల్గొంటున్న 350 మంది పిల్లలు, 50 మంది పెద్దలు మృత్యువాతపడ్డారు. ఈ వార్త దేశం మొత్తాన్ని విషాదంలో ముంచింది. నలుమూలల నుంచి బాధితుల సహాయం కోసం నిధులు వచ్చాయి. 'మానవసేవా సంస్థ' సభ్యులు పెద్ద ఎత్తున రక్తసేకరణ కార్యక్రమం నిర్వహించారు. కానీ మిషనరీస్ ఆఫ్ ఛారిటీ పత్తా లేదు. కోల్‌కతా మదర్‌హౌస్‌లో ప్రత్యేక ప్రార్థనలు మాత్రం జరిగాయి.1994లో దేశంలో ప్లేగు వ్యాపించింది. అదే సమయంలో మదర్ థెరిసా వాటికన్ సందర్శించారు. రోమ్ ఎయిర్‌పోర్ట్‌లో దిగిన థెరిసాను ముందు జాగ్రత్తగా క్వారంటైన్ (అంటు వ్యాధి అయిన ప్లేగు ఇతరులకు సోకకుండా నివారించేందుకు రోగు లను అందరికీ దూరంగా క్వారంటైన్ అనే చిన్న గుడిసెల్లో ఉంచేవారు.) ఉంచారు. వ్యాధి వ్యాపించిన దేశం నుంచి వచ్చారు కాబట్టి ముందు జాగ్రత్తగా థెరిసాను అలా క్వారంటైన్‌లో ఉంచారు. కానీ అసలు సంగతి తెలియని జనం మాత్రం థెరిసా వ్యాధిపీడితులకు ఎంత సేవ చేశారోకదా అని తెగ ప్రశంసించారు. నిజానికి థెరిసా ప్లేగు బాధితులకు చేసిందేమీ లేదని వారికి తెలియదు. ప్రచారం, పేరు మాత్రం వచ్చేసింది.

ఇలా బాధల్లో ఉన్న ప్రజానీకాన్ని ఆదుకోలేకపోవడానికి కారణం ఉంది. కోల్‌కతా కేంద్రంగా పనిచేసినా మదర్ థెరిసా ఏడాదిలో ఎక్కువ భాగం 'విదేశీ యాత్ర'ల్లోనే గడిపేవారు. 1978 నుంచి 1994లో చనిపోయేవరకు ప్రతి ఏడాది వర్షా కాలం, వేసవి కాలాల్లో ఆమె తప్పనిసరిగా యూరప్, అమెరికాల్లో పర్యటించేవారు. నిజానికి ప్రకృతి వైపరీత్యాలు ఈ ఋతువుల్లోనే ఎక్కువగా వచ్చిపడేవి. భ్రూణ(గర్భంలో పిండం) హత్యలకు వ్యతిరేకంగా ఎప్పుడు, ఎక్కడ, ఏ సభ జరిగినా థెరిసా హాజరు కావలసిందే. అబార్షన్ (భ్రూణహత్యలు)ల పట్ల థెరిసా తీవ్ర వ్యతిరేకతను చూపేవారు. (కోర్టులు, సమాజపు అంగీకారం, అనుమతి

ఉన్నా థెరిసా మాత్రం అబార్షన్లను ఒప్పుకునేవారు కాదు. దీనివల్ల అబార్షన్ అత్యవసరమైన కేసుల్లో కూడా అది సాధ్యపడక అనేకమంది సమస్యలు ఎదుర్కొన్నారు. కేవలం మతపరంగా అబార్షన్లను వ్యతి రేకించారుతప్ప అందుకు సరైన కారణాలను చూపలేదు). ముఖ్యంగా విదేశీ పర్యటనల్లో ప్రధానంగా భ్రూణహత్యల వ్యతిరేక ప్రచారం పైనే దృష్టిపెట్టేవారు. ఇలా ఎడతెగని విదేశీ పర్యటనల్లో తలమునకలైనా 'కోల్‌కతా సేవా కార్య క్రమాల'కు (ఏమిటో అవి?) దూరంగా ఉండాల్సి వస్తోందని వీలైనప్పుడల్లా విచారం మాత్రం వ్యక్తం చేస్తుండేవారు. విదేశీ పర్యటనలతోపాటు మదర్ థెరిసా ఆలోచన ధోరణి కూడా సేవా కార్యక్రమాలకు ఆమెను దూరంగా ఉంచింది.'తాను సామాజిక కార్యకర్తను కాను' అని ఆమె అనేకసార్లు కుండబద్దలుకొట్టినట్లు చెప్పారు. అందుకనే సేవ చేయడా నికి అవసరమైన వ్యవస్థను కూడా ఆమె ఏర్పాటు చేసుకోలేదు. అయితే విదేశాల్లో విరాళాలిచ్చే సంస్థలు, సంపన్నులకు మాత్రం ఇక్కడ సేవ చేస్తున్నట్లు చూపించేందుకు ఒక ప్రచార యంత్రాంగాన్ని మాత్రం ఏర్పాటుచేసుకున్నారు. ఎక్కడ ఏ ప్రమాదం జరిగినా 'ప్రత్యేక ప్రార్థన'లతో సరిపెట్టారు తప్ప ప్రత్యక్షంగా సహాయం అందించలేదు. 'పుట్టని పిల్లల సంరక్షణ' (అబార్షన్ వ్యతిరేక ఉద్యమం) కోసం తాపత్రయపడ్డ థెరిసా అనేక ప్రమాదాలబారిన పడిన, పడుతున్న పిల్లల గురించి మాత్రం పట్టించుకోలేదు. "అమెరికా, భారత్, ఆఫ్రికాల్లో పిల్లల పరిస్థితి గురించి కొందరు విచారం, ఆందోళన వ్యక్తం చేస్తుంటారు. కానీ భూమి మీద పడకుండానే, తల్లుల చేతిలో హత్యకు (అబార్షన్) గురవుతున్న పిల్లల గురించి ఎవరూ మాట్లాడటం లేదు. నిజానికి ఈ విషయమే ఎంతో ఎక్కువ ఆందోళనకరమైనది". (National Prayer Breakfast, Washington DC, 3, February, 1994).

అబార్షన్లతోపాటు చర్చి ఆస్తులను రక్షించుకోవడానికి కూడా మదర్ థెరిసా ఎంతో ప్రాధాన్యతనిచ్చేవారు. విదేశీ పర్యటన ల్లో ఎప్పుడూ బిజీగా ఉండే థెరిసా కోల్‌కతాలో ఒక చర్చి (బాండల్ చర్చ్) గోడ కూల్చివేతను ఏకంగా ఉప రాష్ట్రపతి దృష్టికి తీసుకువెళ్ళారు. రోడ్డు వెడల్పు చేయడానికై మున్సిపాలిటీవారు గోడ కూల్చేస్తే, దానిని వెంటనే తిరిగి కట్టేందుకుఆదేశాలివ్వాలంటూ థెరిసా జూలై, 1996లో ఉపరాష్ట్రపతికి లేఖ రాశారు. కోల్‌కతాకు రెండురోజుల పర్యటన కోసం వచ్చిన ఉపరాష్ట్రపతిని ఆమె కోరినది ఏమిటంటే చర్చి గోడ కట్టించమని. ప్రజాసేవకే అంకితమైపోయిన 'మదర్'కు చర్చి ఆస్తుల గురించి అంత ఆత్రుత ఎందుకో?

+++

# అబద్ధాల 'అద్భుత ప్రపంచం'

'నిజం గడపదాటేలోపు అబద్ధం ప్రపంచాన్ని చుట్టివస్తుంది'. అంతేకాదు అబద్ధాన్ని పదేపదే ప్రచారం చేస్తే అదే నిజమైకూర్చుంటుంది. మేకను పట్టుకెళ్తున్న బ్రాహ్మణుడికి అది కుక్క అని పదేపదే చెప్పి నమ్మించి మోసం చేసిన దొంగల కథ అందరికీ తెలిసిందే. అబద్ధానికి మరో లక్షణం కూడా ఉంది. ఒక అబద్ధం చెపితే దాన్ని కప్పిపుచ్చుకునేందుకు మరొకటి చెప్పాల్సివస్తుంది. అలా చివరికి అన్నీ అబద్ధాలే చెప్పాల్సిన స్థితి దాపురిస్తుంది. మదర్ థెరిసా జీవితంలో పైవన్నీ కనిపిస్తాయి. ఆమె ఎవరికీ నిజంగా 'సహాయం' అందించకపోయినా ఆపన్నులను అక్కున చేర్చుకుందనే అబద్ధపు ప్రచారం ప్రపంచాన్ని చుట్టేసింది. ఆ తరువాత ఆమె 'సేవ' గురించి నిజాలు చెప్పినా నమ్మని, నమ్మలేని పరిస్థితి ఏర్పడింది. ఈ అబద్ధపు ప్రపంచాన్ని సృష్టించుకునేందుకు థెరిసా అంతులేని అబద్ధాలను అలవోకగా చెప్పారన్నది ఆమె జీవితాన్ని పరిశీలిస్తే ఇట్టే అర్థమయిపోతుంది. తాను చేస్తున్న 'గొప్ప సేవ' గురించి థెరిసా చెప్పని అబద్ధం లేదు, అనుసరించని వక్రమార్గం లేదు.

వయసు పెరిగినకొద్దీ థెరిసా జీవతంలో అబద్ధాలు కూడా పెరిగాయి. ఉపన్యాసాలు, విలేకరుల సమావేశాలు అతిశయోక్తులు, అసత్యాలతో నిండిపోయాయి. ఆఖరుకు నోబెల్ బహుమతి స్వీకరిస్తూ ఆమె చేసిన ఉపన్యాసం కూడా అబద్ధాల పుట్ట. తనకొక బ్రాండ్ విలువను కలిగించుకునేందుకు థెరిసా అబద్ధాల మార్గాన్ని అనుసరించారు. ఏమీ చేయక పోయినా ఎంతో చేసినట్లు చెప్పుకోవడం అలవాటుగా మారిపోయింది. చివరికి అబద్ధమే ఆమె జీవితమైంది. జర్నలిస్టులు, తనకు నిధులు ఇచ్చే సంపన్నుల మెప్పు పొందేందుకు మదర్ థెరిసా ఎంతకైనా తెగించేవారు. ఇలా నిర్మించుకున్న అబద్ధపు సామ్రాజ్యాన్ని కాపాడుకునేందుకే తాపత్రయపడ్డారు తప్ప 'నిరుపేదలకు సేవ' చేసే ఉద్దేశ్యం ఆమెకు ఏనాడూలేదు. నిరుపేదల సేవలోనే తరించిపోతున్నట్లు ప్రపంచానికి ప్రచారం చేసిన థెరిసా నిజంగా ఎవరైనా సహాయం కోసంవస్తే మాత్రం ఎలాంటి మొహమాటం లేకుండా తిప్పిపంపేవారు. థెరిసా సంస్థ మిషనరీస్ ఆఫ్ ఛారిటీలో వాలంటీర్‌గా పనిచేయడానికి 1990లో వచ్చిన వెస్ట్ వర్జీనియా ఇంటర్నేషనల్ ట్రేడ్ డెవలప్‌మెంట్ సంస్థ అధ్యక్షుడు జాన్ అన్‌గర్ (John Unger) వివరించిన ఒక సంఘటనలో థెరిసా సేవాపరాయణత్వం ఎలాంటిదో ఇట్టే అర్థమైపోతుంది.

'ఒకసారి ఒక పేద గ్రామీణ మహిళ తన పిల్లను ఎత్తుకుని థెరిసా దగ్గరకు వచ్చింది. తన గ్రామంలో రోగాలు ఎక్కువగాఉన్నాయని, జనం చనిపోతున్నారని, ఏదైనా సాయం చేయమని అడిగింది. ఆమె మాటలు పూర్తి కాకుండానే మదర్ థెరిసా చేతులు గాల్లోకి ఎత్తి తన నిస్సహాయతను ప్రకటిస్తూ 'నన్నేం చేయమంటావు. ఒంటరిదాన్ని. ఇంకెవరిదగ్గరకైనా వెళ్లు' అని పంపేశారు. (The Herald – mail Online, Maryland, 13, sept, 1997, www.herald-mail.com) Unger) థెరిసాయే కాదు సహాయం కోసం వచ్చినవారికి మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సిస్టర్స్ ఎప్పుడూ ఇదే సమాధానం చెప్పేవారు. ఒకపక్క ఇలా నిస్సహాయతను ప్రకటిస్తూనే మరోపక్క ఆపన్నులను ఆదుకోవడం కోసమే జీవిస్తున్నట్లు పోజులిచ్చేవారు. ఈ 'సేవా స్వరూపిణి' పేరు సంపాదించేందుకు రకరకాల కట్టుకథలు చెప్పేవారు. ఒకే కథను వందల, వేలసార్లు చెప్పేవారు. అది తాజాగా ఉండేందుకు 'ఈ మధ్యనే', 'ఇటీవలే' అనే మాటలు ఉపయోగించేవారు. తమ సేవలు అందుకున్నవారి సంఖ్య తరుచు మారుస్తుండేవారు.

తన సేవా కార్యక్రమాల గురించి మదర్ థెరిసా స్వయంగా ఎన్నో కట్టుకథలు చెపితే, కాథలిక్ మీడియా ఇంకెన్నో కథలు సృష్టించి ప్రచారం చేసింది. అలాంటి కథల్లో ఒకటి కోల్‌కతాలోని శిశుభవన్ (అనాథాశ్రమం)లో జరిగే 'నిత్యాన్నదానం'. 'ప్రతిరోజూ వేలాది మందికి భోజనం పెట్టేందుకు తగిన ఏర్పాట్లు ఇక్కడ ఉన్నాయి' అని థెరిసా అనేకసార్లు గొప్పగా చెప్పేవారు. (Lucinda Vardey `Mother Teresa, A simple path`, London, Ryder, 1995, p.118) ఇలా రోజూ వేలాదిమంది అన్నంపెట్టే వ్యవస్థను గురించి తెలుసుకుందామని చాలామంది ప్రయత్నించారు.

మదర్ థెరిసా జీవిత కార్యంపై పరిశోధన చేసిన కోల్‌కతాకు చెందిన డాక్టర్ ఆరూప్ చటర్జీ కూడా అన్నదాన కేంద్రాన్ని చూడాలనుకున్నారు. కానీ ఎవరికీ, ఎప్పుడూ అలాంటిది కనిపించనేలేదు! తన పరిశీలన ప్రకారం శిశుభవనంలో రోజుకి 70 మందికి (పగలు 50, రాత్రి 20) మాత్రమే, అది కూడా వారానికి ఐదురోజులు, ఆహారం ఇచ్చేవారని తేలిందని ఆరూప్ చటర్జీ పేర్కొన్నారు. ఆ 'ఆహారం' కూడా ఏమిటో కాదు. మామూలు గంజి. ఈ గంజి భోజనం కూడా సులభంగాదొరకదు. అందుకు ఎంతో కష్టపడాలి. గంజి కూపన్లు సంపాదించుకోవాలి. కూపన్ ఉన్నవారికే తిండి. ముఖ్యంగా ద్నరాపారా మురికివాడకు దగ్గరగా ఉన్న 'ప్రేమ్‌దామ్' సెంటర్‌లో

కూపన్ లేనిదే ఎవరినీ లోపలకే రానీయరు. ఇంతకీ కూపన్ ఎప్పుడు, ఎక్కడ ఇస్తారు? అంటే అది మాత్రం 'సిస్టర్ల' తో సహా ఎవరికీ తెలియదు. మిషనరీస్ ఆఫ్ చారిటీ చేసే అనేక కార్యక్రమాల మాదిరిగానే ఇది కూడా రహస్యమే. నిరుపేదలకు మాత్రమే కూపన్లు ఇస్తామని సిస్టర్లు చెప్పినా, ధ్నరాపారా మురికివాడలో ఉన్న కొన్ని కాథలిక్ కుటుంబాలకు మాత్రం తప్పక దొరికేవి. ఆ కుటుంబాల వాళ్ళు మాత్రంఏ రకంగా చూసినా 'నిరుపేదలు' కారు. అందుకే వాళ్ళు ఎప్పుడూ ఆ కూపన్లు ఉపయోగించుకునేవారు కాదు. మొత్తా నికి కోట్ల డాలర్ల నిధులు సేకరించి, బ్యాంకుల్లో మురగబెట్టిన మదర్ థెరిసా 'నిరుపేదల' కోసం గంజికేంద్రాలు మాత్రం నిర్వహించారు. ఆ గంజికేంద్రాల ద్వారానే అన్నార్తుల ఆకలి తీర్చేస్తున్నానని భారీ ప్రచారం చేసుకునేవారు. సందర్భానుసారంగా సంఖ్యను మార్చేస్తూ ఉండేవారు. ఒకసారి '9000', మరోసారి '7000', ఇంకోసారి '4000'..... ఇలా నోటికి వచ్చిన అంకె చెప్పేవారు. ఎంత చెప్పినా అది 'వేలల్లో'నే ఉండేట్లు చూసుకునేవారు. ఈ అంకెల గారడీని కనిపెట్టి ఎప్పుడైనా, ఎవరైనా నిలదీస్తే మాత్రం కాస్త తగ్గి 'వెయ్యి మందికి నిత్యం అన్నం పెడుతున్నామని' చెప్పేవారు. నోబెల్ బహుమతి పొందిన తరువాత థెరిసాకు ధైర్యం ఎక్కువైపోయింది. అప్పటివరకు చెపుతున్న అబద్ధాల్ని నిజం చేసేందుకు వాటిని మరింత గట్టిగా చెప్పడం మొదలుపెట్టారు. ఆమె జీవిత చరిత్రను రాసిన కాథరిన్ స్పింక్‌తో థెరిసా ఇలా చెప్పారు - "ఒక్క కలకత్తాలోనే 7000 మందికి ఆహారం పెడతాం. ఒక్కపూట మా కిచెన్ మూతపడితే ఇన్ని వేలమందీ ఆకలితో మాడాల్సిందే" (Kathryn Spink, For the Brotherhood of Man under the Fatherhood of God, Mother Teresa of Calcutta, Colour Library International, 1981, p.88) నిజానికి మిషనరీస్ ఆఫ్ చారిటీ కేంద్రాలన్నింటిలో కలిపి రోజుకి 500 మందికంటే మించి ఆహారం దొరికేది కాదు.

అందులోనూ సంస్థకు చెందిన సిస్టర్లు, బ్రదర్స్, పనివాళ్ళే ఎక్కువగా ఉండేవారు. '7000 మందికి ఆహారం' 'ఒక్కపూటవండకపోయినా పస్తులు' అనే ఈ కట్టుకథకు మూలం బైబిలులోని 'ఏసు బ్రెడ్, చేపలు పంచెను'అనే కథ. ప్రపంచ పర్యటనల్లో పదేపదే ఈ కథను వినిపించిన థెరిసా కోల్‌కతాలో మాత్రం చెప్పేవారు కాదు!(బండారం బయటపడి పోతుందని భయమేమో?). ఈ కథ ద్వారా థెరిసాకు మాయలు, మహిమలు ఉన్నాయని క్రమంగా ప్రచారం కూడా జరిగింది. థెరిసా చెప్పిన 'కథ' ఇలా ఉంది - "దేవుని రక్షణను మేము అనేక మార్గాల్లో పొందేవాళ్ళం. ఒక్క కలకత్తాలోనే ప్రతిరోజూ7000 మందికి ఆకలి తీర్చేవారం. ఒక్కపూట కిచెన్

పనిచేయకపోతే ఇంతమందీ పస్తులు ఉండాల్సిందే. ఒక శుక్రవారంపొద్దున్న కిచెన్ ఇన్‌ఛార్జ్‌గా ఉన్న సిస్టర్ నా దగ్గరకు వచ్చి 'మదర్ ఇవాళా, రేపు పెట్టేందుకు ఏమీ లేదు' అని చెప్పింది. నేను నిర్ఘాంతపోయాను. ఏం చేయాలో అర్థం కాలేదు. కానీ సరిగ్గా 9 గంటలకు ఒక అద్భుతం జరిగింది. భారత ప్రభుత్వం ఎందుకనో స్కూళ్ళకు సెలవు ప్రకటించింది. ఆ స్కూళ్ళకు పంపిణీ కావలసిన బ్రెడ్ మాకు చేరింది. దీనితో మా పిల్లలతో సహా ఏడువేలమందికి రెండురోజులపాటు తినేందుకు పుష్కలంగా బ్రెడ్ దొరికింది. వాళ్ళు తమ జీవితంలోఅంత బ్రెడ్ ఎప్పుడూ తిని ఉండరు. స్కూళ్ళు హఠాత్తుగా ఎందుకు మూసేసారన్నది ఎవరికీ తెలియలేదు. అలా ఎందుకు జరిగిందో నాకు మాత్రం తెలుసు. ఆకలి నుంచి కాపాడేందుకు దేవుడే అలా రక్షణ కల్పించాడు" (Lecture by Teresa at Dublin on 2.6.1979 quoted in the book `One Heartful of Love, Mother Teresa` by Jose Luis Gonzalez Balado, Fount, 1989, p.44) 1975-85 మధ్యకాలంలో థెరిసా ఈ కట్టుకథను కొన్ని వేలసార్లైనా జనానికి చెప్పిఉంటారు. 1982లో స్కాటిష్ టెలివిజన్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలోనూ ఇవే మాయమాటలు చెప్పారు. ఇంటర్వ్యూ చేసిన ఇయాన్ గాల్‌కి ఇలా చెప్పారు-'ప్రతి రోజూ మేం 7000 మందికి ఆహారం సమకూరుస్తాం. ఒక్కరోజు అలా చేయలేకపోతే ఇంతమందీ....'. ఈ ఇంటర్వ్యూ వీడియోని ఇప్పటికీ కాథలిక్కులు ఎంతో భక్తిశ్రద్ధలతో చూస్తూ ఉంటారు. మదర్ థెరిసా ఇలా ముందు వెనుక చూసుకోకుండా సంఖ్యను ఇష్టంవచ్చినట్లు పెంచేస్తూ ఉంటే ఆమె మాటల్ని సమర్థించడానికి ఒక్కోసారి ఆమె అతి విశ్వాసపాత్రులు, భక్తులకు కూడా కష్టమయ్యేది. ఒకసారి తన సేవ గురించి మాట్లాడుతూ మంచి ఊపులో కోల్‌కతాలో 9000 మందికి ప్రతిరోజూ ఆహారం అందిస్తున్నామని థెరిసా అనేశారు. అది విన్నవారు కాస్త ఆశ్చర్యంగా, అనుమానంగా చూడడంతో అక్కడే ఉన్న జోసే లూయిస్ గొంజాలె బాలెడో (Luis Gonzalez Balado) (ఈయన థెరిసా పరమభక్తుడు, థెరిసా జీవిత చరిత్రను రాసినవాడు)సర్దిచెప్పక తప్పలేదు. 'నిరంతరం సేవ చేస్తూ ఉండడమేతప్ప థెరిసా ఇలాంటి లెక్కల్ని పట్టించుకోరు. ఎంత పని చేశామన్నదికాక ఆ పనిలో ఎంత నిమగ్నమయ్యామో, ఎంత ప్రేమను పంచామో ముఖ్యమని ఆమె అంటారు'. (Luis Gonzalez Balado, Loving Jesus, Mother Teresa,Fount,1991,p.156)

థెరిసా అతిశయోక్తులవల్ల ఇలా ఇబ్బందిపడ్డ బాలెడోయే స్వయంగా అదే పని చేశాడు. మదర్ థెరిసా 'సూక్తుల' పుస్త కాన్ని ఎడిట్ చేసిన బాలెడో 'అన్నార్తుల' సంఖ్యని 10,000లకు పెంచేశాడు. ఒకప్పుడు అంతకంటే తక్కువ సంఖ్య చెపితేనే కంగారుపడ్డ బెలెడో ఆ తరువాత అదే అంకెను పెంచేయడానికి ఒక కారణం కనిపిస్తుంది. అతిశయోక్తులు, అబద్ధాలు చెపితే ఎదుటివారు ఏమంటారోననే భయం ఉన్నంతవరకు అలా చెప్పేందుకు సంకోచించి ఉంటాడు. ఎన్నిఅబద్ధాలాడినా అడిగేవారు లేరనే ధైర్యం వచ్చిన తరువాత 'మదర్'నే మించిపోయి కోతలు కోశాడు. పైగా మత ప్రచారంకోసం ఏమైనా చేయవచ్చని 'పెద్దలు' చెప్పిఉంటారు. అన్నార్తుల్ని ఆదుకునే కథకు మూలం బైబిల్‌లో ఉందని ఇంతకుముందు చెప్పుకున్నాం. బైబిల్‌లోని జాన్ 6 । 9- 13లో జీసస్ 5000మందికి బ్రెడ్, చేపలు పంచాడని ఉంటుంది. అలాగే లూక్ (9। 13- 17) జీసస్ 5000 మందికి ఒక్కొక్కరికీ 5 బ్రెడ్‌లు, రెండు చేపల చొప్పున ఇచ్చాడని వర్ణిస్తుంది. మార్క్ (8। 9) ప్రకారం జీసస్ 4000 మందికి బ్రెడ్, చేపలు ఇచ్చి ఆకలి తీర్చాడు. వేరువేరు కాలాల్లో వేరువేరు వ్యక్తు లు చెప్పారు కాబట్టి ఈ సంఖ్యలో తేడా వచ్చిందని అనుకోవచ్చును. కానీ థెరిసా తన గురించి తానే చెపుతున్నప్పుడు ఇలా అంకెల్లో తేడా వచ్చే అవకాశమే లేదు. కానీ జీసస్‌కు సమానంగా తన బ్రాండ్ విలువను సృష్టించుకోవాలనే ఆత్రుతలో పాపం థెరిసా ఈ సంగతి మరచిపోయారు. '5000' సంఖ్య అంటే థెరిసాకు ఎంతో వ్యామోహం. ఎందుకంటే బైబిల్‌లో జీసస్ సహాయం చేసినవారి సంఖ్య అదే. అందుకే వీలైనప్పుడల్లా ఈ సంఖ్యను ఉపయోగించేవారు. 'మోతీజీల్ మురికివాడలో ఇప్పుడు 5000మంది పిల్లలతో అదునాతనమైన స్కూలు నడుపుతున్నాం' (David porter , Mother Teresa, the Early Years, SPCK, 1986, p.70) అని థెరిసా గొప్పగా చెప్పారు.

'మేం అక్కడ స్కూలు పెట్టకపోతే వేలాదిమంది పిల్లలు మట్టికొట్టుకుపోయి ఉండేవారు' అని మాల్కమ్ మగ్గరిడ్జ్‌తో అన్నారు. కానీ నిజానికి 1969 - 70 మధ్యకాలంలో థెరిసా ప్రైమరీ స్కూళ్ళలో 200 కంటే ఎక్కువ మంది లేరు. ఇక 5000 మంది పిల్లలున్నారని గొప్పగా చెప్పిన మోతీజీల్ స్కూలులో 100 మందికంటే ఎక్కువలేరు. ఒకే క్యాంపస్‌లో 5000 మంది పిల్లలున్న స్కూలు బహుశా ఈ ప్రపంచంలోనే ఎక్కడా లేదు. కోల్‌కతాలో, ఆ మాటకొస్తే దేశంలోనే ఎక్కువమంది పిల్లలున్న స్కూలు సౌత్‌పాయింట్. ఈ స్కూలుకు 6 క్యాంపస్‌ల్లో 11 వేల మంది పిల్లలున్నారు. మోతీజీల్ స్కూలు విషయానికి వస్తే థెరిసా చెప్పినవన్నీ కట్టుకథలేనని

ఆ మురికివాడ వాసులే తేల్చేశారు. థెరిసా చనిపోయిన తరువాత ఈ మురికివాడలో అడుగుపెట్టిన జర్నలిస్ట్‌లకు అనేక ఆశ్చర్యకరమైన విషయాలు తెలిశాయి. ఆనంద్‌బజార్ పత్రిక విలేకరులు మోతీజీల్‌లో ఎంతోకాలంగా ఉంటున్న పల్టాన్‌రాయ్‌ని పలకరించారు. థెరిసా మరణం గురించి అడిగారు. థెరిసా మరణానికి విచారం వ్యక్తం చేసిన రాయ్ స్కూలు గురించి అసలు విషయం చెప్పాడు. ఒకప్పుడు వాడలో రెండు స్కూళ్ళు ఉండేవని, ఆ తరువాత ఒకటి మూతపడిందని, ప్రపంచానికి ఎంతో చేసిన (?) థెరిసా ఇక్కడి స్కూలు బాగుకు మాత్రం ఏమీ చేయలేకపోయిందని వాపోయాడు. ఎప్పటి నుంచో ఒకే అంతస్థు భవనంలో నడుస్తున్న స్కూలుకు కనీసం మరో అంతస్థు కట్టించి ఉంటే బాగుండేదని అన్నాడు. (ఆనంద్‌బజార్ పత్రిక 11. సెప్టెంబర్, 1997, కోల్‌కతా).

థెరిసా తరుచుగా వినిపించిన మరో కట్టుకథ - కోల్‌కతా వీధుల్లో పడిఉన్న అబాగ్యులను చేరదీయడం. నోబెల్ ప్రైజ్ పుచ్చుకుంటూ చేసిన ఉపన్యాసంలో థెరిసా " కలకత్తాలో ప్రాణాంతక వ్యాధులతో అవసాన దశలో ఉన్నవారి కోసం సంరక్షణ కేంద్రాన్ని నిర్వహిస్తున్నాం. కలకత్తా వీధుల్లోంచి ఇలాంటి రోగుల్ని 36,000 మందిని కేంద్రానికి చేర్చాం. వీరిలో 18,000 మంది చివరికి 'అందమైన మృత్యువు'ను చేరుకున్నారు. వాళ్లంతా 'దేవుని గృహమున'కు చేరుకున్నారు అని గొప్పగా చెప్పుకున్నారు. థెరిసా ఈ కథను అప్పటికే అనేకసార్లు ప్రచారం చేశారు. దానితో సేవాదృక్పథం కలిగిన యువతీయువకులు కొందరు సొంత డబ్బు ఖర్చు పెట్టుకుని కోల్‌కతా వీధుల్లో ఉన్న వ్యాధిగ్రస్తుల్ని థెరిసా కేంద్రాలకి చేర్చే వారు. కానీ ఇన్ని కబుర్లు చెప్పిన థెరిసా, ఆమె సిస్టర్ల గణం ఏనాడూ ఎవరినీ ఇలా సంరక్షణ కేంద్రానికి చేర్చలేదన్నది పచ్చినిజం. కోట్లాది డాలర్ల నిధులు బ్యాంకుల్లో మూలుగుతున్నా, వాటిలో ఒక్క పైసా కూడా బాధితుల్ని ఆదుకు నేందుకు ఖర్చుపెట్టలేదు. ఇంతకీ థెరిసాకు చెందిన మిషనరీస్ ఆఫ్ చారిటీ చేసిందేమిటి? ఆ సంస్థ ఏదో గొప్ప 'సేవ' చేస్తామని చెపితే నమ్మి కొందరు వ్యాపారస్థులు, సంపన్నులు కొన్ని వాహనాలు డొనేట్ చేశారు. వాటికి తెల్లరంగు వేసి, .పైన ఎర్ర బల్లు పెట్టి అంబులెన్సుల్లా తయారుచేశారు. వీటికి ట్రాఫిక్ నిబంధనలు కూడా ఏమీ ఉండేవి కావు. ఇంతకీ ఈ వాహనాల్ని ఎందుకు ఉపయోగించేవారంటే సిస్టర్లను ఒక సెంటర్ నుంచి మరో సెంటర్‌కు రవాణాచెయ్యడానికి. ఇలా టాక్సీలుగా పనికొచ్చిన ఈ 'అంబులెన్స్'ల్లో కనీసం స్ట్రెచర్ కూడా ఉండేదికాదు. ఫెడరల్ ఎక్స్‌ప్రెస్ డొనేట్ చేసిన అలాంటి

ఒక వాహనం నిండా కోళ్ళను తరలిస్తుంటే 21, ఆగస్ట్, 1996 న చూశానని కోల్‌కతాకు చెందిన డాక్టర్ అరూప్ చటర్జీ వివరించారు. (అరూప్ చటర్జీ థెరిసా, ఆమె మిషనరీస్ ఆఫ్ ఛారిటీ కార్యకలాపాలను పరిశీలించి, పరిశోధించి మదర్ థెరిసా - ది ఫైనల్ వర్‌డిక్ట్ అనే 400 పేజీల పుస్తకం రాశారు.) ప్రతి ఏడాది జరిగే వార్షికోత్సవం కోసం పెద్ద సంఖ్యలో కోళ్ళను తరలించడం మామూలే. ఈ కోళ్ళ తరలింపును అరూప్ చటర్జీ తన కెమెరాలో బంధించారు కూడా. ఇలా కోళ్ళను, సిస్టర్లను తరలించడానికే ఉపయోగించుకున్న వాహనాలను అప్పుడప్పుడైనా రోగులకోసం వాడే వారనడానికి దాఖలాలు లేవు. పైగా ఎవరైనా అంబులెన్స్ కోసం అడిగితే మునిసిపల్ కార్పొరేషన్ వాహనాలను సంప్రదించడని సలహా మాత్రం ఇచ్చేవారు. ఇలా సలహా ఇచ్చే బదులు తమకున్న అపారమైన నిధులతో అంబులెన్స్‌లుకొని ఉండవచ్చును. లేదా కనీసం ఎవరో దానం చేసిన వాటినైనా సరిగా ఉపయోగించి ఉండవచ్చును. థెరిసా అంబు లెన్స్ 'టాక్సీ' సర్వీస్ గురించి కాలిఫోర్నియా గవర్నర్ జెర్రీ బ్రౌన్ (ఒకప్పుడు కోల్‌కతాలోని రోగుల సంరక్షణ కేంద్రంలో వాలంటీర్‌గా పనిచేయడానికి వచ్చారు) వివరించారు 'ప్రతిరోజూ సాయంత్రం 6 గం.లకు నేను, నాతోపాటు మరికొంత మంది సిస్టర్స్ అంబులెన్స్‌లో బయలుదేరి మదర్‌హౌస్‌లో జరిగే ప్రార్థన సమావేశానికి వచ్చేవారం. ఆ సమావేశంలో మదర్ తప్పక పాల్గనేవారు'. (Life, April, 1988).

కోల్‌కతాలో అంబులెన్స్ సర్వీస్ అందించే సంస్థల జాబితాను టెలిగ్రాఫ్ పత్రిక ప్రచురించింది. ఆ లిస్ట్‌లో మిషనరీస్ ఆఫ్ చారిటీ పేరు మాత్రం కనిపించదు. ఇక అందరితోపాటు అంబులెన్స్‌లో ఇరుక్కుని కూర్చుని ప్రయాణం చేయని సీనియర్ సిస్టర్లు ఏకంగా ప్రైవేటు టాక్సీలనే ఉపయోగించేవారు. కానీ బయటకి మాత్రం సిస్టర్లు కాలినడకన, బస్సుల్లో తిరిగి తమ 'సేవా' కార్యక్రమాలు సాగించే వారని ప్రచారం చేసేవారు. ఇందుకు కూడా బైబిల్ కథలే ఆధారం. జీసస్, ఆయన అనుచరులు 'పవిత్ర భూమి' లో కాలినడకన తిరిగినట్లు సిస్టర్లు తిరిగేవారని చెప్పడం ఈ ప్రచారపు లక్ష్యం. అందుకనే థెరిసా అధికారిక జీవిత చరిత్రనురాసిన నవీన్ చావ్లా (మాజీ చీఫ్ ఎలక్షన్ కమిషనర్. కాంగ్రెస్ ఏజెంట్‌గా పనిచేస్తున్నారని పై అధికారి అభిశంసనకు గురైన వ్యక్తి) 'సిస్టర్లు నిరుపేదలు ఉపయోగించే రవాణా సదుపాయాలనే వాడతారు. ఎంత దూరమైనా సాధారణంగా నడిచి వెళతారు. లేకపోతే ప్రజారవాణా సదుపాయాన్ని (బస్సు)ఉపయోగిస్తారు' అని రాశారు.

సిస్టర్లు, మదర్ థెరిసా ఎంతో నిరాడంబరమైన, హంగుఆర్భాటంలేని జీవితం గడిపేవారని కాథలిక్ మీడియా ప్రచారం చేసేది. కానీ సిస్టర్ల విలాసవంతమైన, ఆర్భాట జీవన శైలిని చూపే ఫోటోగ్రాఫ్‌లు ఎన్నో ఉన్నాయి.కోల్‌కతా కేంద్రంగా పనిచేసిన మిషనరీస్ ఆఫ్ ఛారిటీలో పనిచేసిన సిస్టర్లకు, అమాటకొస్తే వాళ్ల 'మదర్' కు కూడా స్థానిక బెంగాలీ భాష ఒక్కముక్క కూడా వచ్చేదికాదు. బెంగాలీ రాకుండా సామాన్య, చదువురాని ప్రజల కోసం వాళ్ళు ఎలా పనిచేయగలిగారన్నది ఒక మాయ. మరి నిరుపేదలతో సిస్టర్లు ఎలా మాట్లాడేవారు? అంటే అసలు మాట్లాడేవారే కాదు. ఎందుకంటే వీధుల్లోకి వెళ్ళి నిరుపేదలతో మాట్లాడి, వారికి సహాయం చేయాల్సిన అవసరం వారికి వచ్చేదేకాదు. వివిధ సెంటర్లలో మాత్రం ఇంగ్లీష్, ఇటలీ, జర్మన్, స్పానిష్ మొదలైన భాషలు ఉపయోగించేవారు. లేకపోతే మూగ సంజ్ఞలతో పనికానిచ్చేవారు. మదర్ థెరిసా హోమ్‌లలో పనిచేయడానికి విదేశస్థులు వచ్చేవారు. వాళ్ళ చేతనైనది చేసినాస్థానికులతో మాట్లాడలేకపోతున్నామని బాధపడేవారు. బైబిలు అర్థం చేసుకునేందుకు అవసరమైన ఇంగ్లీషు తప్ప స్థానిక భాష రావలసిన అవసరం లేదన్నది మిషనరీస్ ఆఫ్ ఛారిటీ నిబంధనల్లో ఒకటి. స్థానిక భాష రాకుండా స్థానికులకు ఎలా సేవ చేశారో? చేస్తున్నారో? మదర్ థెరిసాకు కూడా 'మీ కోసం ప్రార్థిస్తాను', 'బాధలు, కష్టాలే మిమ్మల్ని జీసస్‌కు దగ్గర చేస్తాయి' మొదలైన కొన్ని మతసూక్తులు తప్ప బెంగాలీ రాదు. పైగా బెంగాలీ నేర్చుకునేందుకు ఏనాడూ ప్రయ త్నించ లేదు. ఇలా ఒక్కముక్క బెంగాలీ రాని థెరిసా కోల్‌కతా మోతీజీల్ స్కూలులో పిల్లలకి ఏకంగా బెంగాలీ నేర్పారనిజీవిత చరిత్రలో రాశారు. థెరిసా పరమభక్తుడైన జర్నలిస్ట్ ఫ్రాంకా జంబోనినీ (Franca Zambonini) ఇలా రాశాడు - "థెరిసా మొట్టమొదట చేపట్టిన సేవా కార్యక్రమం స్కూలు నడపడం. మోతీజీల్ మురికివాడలో పిల్లల్ని ఒకచోటకు చేర్చారు. ఒక పూరిగుడిసెను స్వయంగా శుభ్రం చేసి పిల్లలకి చదువు చెప్పడం మొదలుపెట్టారు. బ్లాక్‌బోర్డ్ లేదు కనుక నేలమీదే బెంగాలీ అక్షరాలు రాసి పిల్లలతో దిద్దించారు. చివరికి పద్యం, ప్రార్థనతో క్లాసు ముగించారు." (Franca Zambonini, Teresa of Calcutta A pencil in God`s Hand, Alba house, 1993, p.43) కానీ మోతీజీల్ మురికివాడలో ఎక్కువగా నివాసం ఏర్పరచుకున్న బీహారీ ముస్లిములకు ఉర్దూ, హిందీ తప్ప బెంగాలీ అసలు రాదని తెలిసినవారికి ఇది కట్టుకథని ఇట్టే తెలిసిపోతుంది. పైగా ఇప్పటికీ మోతీజీల్‌లో ఉన్న ఒకే ఒక్క ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలో కూడా ఉర్దూలోనే చదువు చెపుతారు. కోల్‌కతాలో గడిపిన 45 ఏళ్లలో మదర్ థెరిసా

ఒక్కముక్క కూడా బెంగాలీలో రాయలేదు. ఇంగ్లీషులోనే ఉత్తరప్రత్యుత్తరాలు సాగించేవారు.

ఎంతటి కష్టంలో ఉన్నవాడైనా, అతనికి కుటుంబం ఉంటే, సహాయం పొందడానికి అర్హుడుకాడని మదర్ థెరిసా కఠిన నిబంధన పెట్టారు. కేవలం 'అనాథలు' మాత్రమే సహాయం పొందేందుకు అర్హులన్నది థెరిసా దృఢమైన అభిప్రాయం. ఇలా 'కుటుంబ వ్యవస్థ' పై కత్తికట్టిన థెరిసాయే తరుచు ఇలా అనేవారు - ' మీ ఇళ్లలోనే ఆకలితో మాడుతున్న క్రీస్తు ఉన్నాడు. ధరించడానికి వస్త్రాలు లేక అర్ధనగ్నంగా ఉన్న క్రీస్తు ఉన్నాడు. సంరక్షణ లేని క్రీస్తు ఉన్నాడు. అలాంటి క్రీస్తును గుర్తించారా?'. నావాళ్ళు అనేవాళ్ళు ఉన్నవారిని అసలు పట్టించుకోని థెరిసా మళ్ళీ కుటుంబాల గురించి, అందులో 'పేద క్రీస్తు' గురించి వాపోవడం రెండునాల్కల ధోరణి కాదూ! పైగా సహాయం పొందడానికి అనాథ అయిఉండాలన్న నిబంధన మనదేశం వరకే. రోమ్‌లోని మిషనరీస్ ఆఫ్ ఛారిటీలో ఇలాంటి నిబంధనలు ఏమీలేవు. ఇలా అడ్డుఅపూ లేకుండా అబద్ధాలు చెప్పిన థెరిసాకు కాథలిక్ మీడియా గట్టి వత్తాసు పలికింది.

ఒక్కోసారి ఆమె చెప్పని అతిశయోక్తుల్ని జర్నలిస్ట్‌లే స్వయంగా సృష్టించేవారు. (ఉదా. మోతీజీల్‌లో బెంగాలీ అక్షరాలు దిద్దించడం వంటివి) అందుకనే థెరిసాకు కాథలిక్ మీడియా అంటే వల్లమాలిన అభిమానం. వాళ్ళు 'దేవుని కార్యం చేస్తున్నారు' అంటూ పొగడేవారు. ఆమె చేయని 'ఘన కార్యాల' గురించి జర్నలిస్ట్‌లు రాసిపారేస్తే, కొందరు రచయితలు ఇంకాస్త ముందుకువెళ్ళి ఆమెను కనీసం ఒక్కసారి కూడా కలవకుండానే జీవితచరిత్రలు తయారుచేశారు. పిల్లలకోసం ఆడ్రీ కాన్‌స్టాంట్ (Audrey Constant) రాసిన థెరిసా జీవితచరిత్ర సరిగ్గా ఇలాంటిదే. దీన్ని థెరిసా స్వయంగా ఎడిట్ చేశారు! 'మిషనరీస్ ఆఫ్ ఛారిటీ' సిస్టర్లు చెప్పిన విషయాల ఆధారంగా నేను ఈ చిన్న పుస్తకం తయారుచేశాను. ఇప్పటివరకు మదర్‌ను కలవలేదు' అని ఆడ్రీ స్వయంగా వెల్లడించింది. ఆ పుస్తకంలో సిస్టర్లు చెప్పిన కట్టుకథలే కనిపిస్తాయి. 'ఒక్క కలకత్తాలోనే 122 కుష్టువ్యాధి చికిత్స కేంద్రాలు నడుపుతున్నాం. కుష్టు వ్యాధి పీడితులతో కలకత్తా నిండిపోయింది. ఎంతగానంటే కుష్టువారి కోసం ప్రత్యేకంగా చర్చ్ ఏర్పాటు చేయాల్సివచ్చింది' (Audrey Constant, In the streets of Calcutta, The story of Mother Teresa, Religious and Moral education press, 1980, p.15) నిజానికి

కోల్‌కతాలో కుష్టురోగుల కోసం ప్రత్యేక చర్చీ లేదు, అన్ని చికిత్స కేంద్రాలూ లేవు.అబార్షన్లను పూర్తిగా రూపుమాపాలని కంకణం కట్టుకున్న థెరిసా 1979లో అప్పటి భారత ప్రధాని మొరార్జీదేశాయ్‌కి ఘాటైన లేఖ రాశారు. అబార్షన్లను వెంటనే నిషేధించాలని, ఇందుకు తగిన చర్యలు వెంటనే తీసుకోవాలని గట్టిగా కోరారు. 'ఒక్క కలకత్తాలోనే సహజ స్వయం నియంత్రణ' (ప్రకృతిసిద్ధమైన కుటుంబనియంత్రణ) నేర్పే 102 సెంటర్లు నడుపుతున్నాం' అని గొప్పగా చెప్పుకున్నారు! అయితే అలాంటి సెంటర్ ఒక్కటి కూడా లేదన్నది పచ్చినిజం. దేశ ప్రధానికి రాసిన లేఖలో కూడా ఇలాంటి పచ్చి అబద్ధాలు, పూర్తి అతిశయోక్తులు రాయడం థెరిసాకే చెల్లింది. ఒక్క ప్రధానికేమిటి నోబెల్ ప్రైజు తీసుకుంటున్నప్పుడు కూడా థెరిసా ప్రపంచానికి ఇలాంటి అబద్ధాలే చెప్పారని ముందు పేజీల్లో చూశాం. 13 ఏళ్ల తరువాత థెరిసా స్నేహితుడు, కోల్‌కత్తాకు చెందిన మతప్రవక్త ఎడ్వర్డ్ లెజోలేయే స్వయంగా మదర్ బండారాన్ని బయటపెట్టాడు. ప్రపంచవ్యాప్తంగా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ నిర్వహిస్తున్నది కేవలం 69 కుటుంబ నియంత్రణ కేంద్రాలని చెప్పి వాటి జాబితా ఇచ్చాడు. అసలు సంగతి ఏమిటంటే ఆ జాబితాలో కోల్‌కతాకు చెందిన ఒక్క సెంటర్ కూడా లేదు! (Edward Le Joly, Mother Teresa A woman In Love, Ave Maria press, 1993, p.189.) 13, జూలై, 1977 లండన్‌లో జరిగిన ఛారిటీ సంస్థ సమావేశంలో కూడా థెరిసా ఇదే అబద్ధాన్ని చెప్పారు. 'కలకత్తాలోని మన 59 సెంటర్లలో బాధితులకు ఆహారం అందించేందుకు వారానికి రూ. 20,000 ఖర్చు పెడుతున్నాం'. (Speech by Mother Teresa to co-workers on 13, June,1977 at the Brompton oratory, as quoted in one Heart Full of Love, p.61) 1977లో మదర్ థెరిసా సంస్థ ఆధ్వర్యంలో 4 సెంటర్లు ఉండేవి. పస్తుతం 3 పెద్ద క్రైస్తవ సన్యాసినుల కేంద్రాలతోపాటు 8 సెంటర్లు ఉన్నాయి. ఈ 59 సంఖ్య ఎక్కడ నుంచి వచ్చిందోఎవరికీ తెలియదు. ఇలా అంకెల్ని సృష్టించడం, ఇష్టంవచ్చినట్లు పెంచెయ్యడం 'సైకోసిస్' అనే వ్యాధి లక్షణం కావచ్చును. లేదా 19 శతాబ్దానికి చెందిన అద్భుత కథలు సృష్టించే 'సూడోలాజికా ఫెంటాస్టికా' (Pseudologica fantastica) లక్షణమైనా అయిఉండవచ్చును. అబార్షన్లను తీవ్రంగా వ్యతిరేకించిన థెరిసా పోషించలేని పిల్లల్ని తమకు ఇచ్చేయాలని ప్రోత్సహించేవారు. పోషించే స్తోమత లేకపోతే పిల్లల్ని కనవద్దని చెప్పాల్సిందిపోయి మీరు కని మాకు అప్పచెప్పండని ప్రోత్సహించేవారు. పోనీ పిల్లల్ని కనడానికి ముందు, ఆ తరువాత తల్లుల సంరక్షణ బాధ్యత తీసుకున్నారా అంటే

అది మాత్రం లేదు. ప్రభుత్వ ప్రసూతి ఆస్పత్రుల్లో చాలా వరకు బెడ్‌లు థెరిసా పంపిన వారితోనే నిండిపోయేవి. ఇలా ప్రభుత్వ ఖర్చులతో ప్రసూతి సదుపాయాలు పొంది ఆ తరువాత పిల్లల్ని మాత్రం విదేశాలకు తరలించేవారు. పిల్లల తల్లులకు మాత్రం ఒక్క పైసా ఇచ్చేవారు కాదు. ఇలా చేస్తున్నా వేలాదిమంది మహిళలకు ఎంతో సేవ చేస్తున్నామని ప్రచారం మాత్రం చేసుకునేవారు. తల్లుల పొత్తిళ్ల నుంచి పిల్లల్ని తీసుకుని వాళ్లని విదేశాలకు తరలించడం మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి వెన్నతోపెట్టిన విద్య.అలా పిల్లల్ని అప్పగించేట్లు తల్లుల్ని ఒప్పించడంలో సంస్థ సిస్టర్లు ప్రావీణ్యత సంపాదించారు. ఇందుకు ఫీజు కూడావసూలు చేసేవారు. ఇలా పేద హిందూతల్లుల ప్రసవవేదనను థెరిసా సొమ్ము చేసుకునేవారు. 30, ఆగస్ట్, 1996న జరిగిన సంఘటన పిల్లల్ని తల్లుల నుంచి వేరు చేయడానికి సిస్టర్లు ఎంత నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తారో చూపుతుంది. కోల్‌కతాకు చెందిన డా. అరూప్ చటర్జీ ఈ సంఘటనకు ప్రత్యక్షసాక్షి. ఆ రోజు నూర్జహాన్ అనే మహిళ తన ఇద్దరు చంటి పిల్లలతో థెరిసా అనాథాశ్రమం శిశుభవన్‌కు సహాయం కోసం వచ్చింది. అంతకు ముందు రాత్రే వాచ్‌మెన్ దయతో శిశుభవన్‌లో తలదాచుకున్న ఆమెను తెల్లవారగానే సిస్టర్లు బయటకి గెంటేశారు. అప్పటి నుంచి ఎంత వేడుకున్నా ఆమెను లోపలికి రానీయలేదు. మండుటెండలో ఆమె పిల్లలతోపాటు గేటు బయటే పడిగాపులు పడింది. చంటి పిల్లలకు కనీసం పాలు ఇవ్వడానికి కూడా నిరాకరించారు. ఆ పిల్లలపై సర్వాధికారులు తమకు ఇస్తే వాళ్ళని మాత్రం లోపలికి అనుమతిస్తామని నిబంధన విధించారు. ఇందుకు 'పిల్లల అప్పగింపు' పత్రంపై సంతకం చేయాలని నూర్జహాన్‌ను బలవంతపెట్టారు. కానీ పిల్లల్ని ఎట్టి పరిస్థితిలోనూ అప్పగించేది లేదని ఆమె తిరిగి వెళ్ళిపోయింది. 'నా ఇంట్లో ఎంతమంది పిల్లలు ఉన్నా ఎప్పుడూ ఇంకొకరికి చోటు ఉంటుంది' అనే మదర్ థెరిసా మాటల వెనుక అసలు అర్థం పాపం నూర్జహాన్‌కు తెలియదు. థెరిసా, ఆమె సిస్టర్లేకాదు ఆమె సంస్థలో వాలంటీర్లుగా పనిచేయడానికి వచ్చే విదేశస్థులు కూడా అంతటి 'కారుణ్యమూర్తులే'. నూర్జహాన్ ఉదంతం జరుగుతున్నప్పుడే శిశుభవన్‌కు ఒక విదేశస్థురాలు వచ్చింది. పొద్దుటి నుంచి ఎండలో పడిగాపులు పడుతున్న నూర్జహాన్, ఆమె పిల్లలకు తిండి పెట్టించమని ఆ విదేశస్తురాలిని అడిగితే అందుకు నిరాకరించడమేకాక తీవ్ర అసహనాన్ని వ్యక్తం చేసింది. ఈ దేశపు పేదలకు సేవ చేయడానికిఎక్కడ నుంచో వచ్చిన తనను ఇబ్బంది పెడతారా అంటూ కోపగించుకుంది! (అవిడని ఎవరు రమ్మన్నారో? పోనీ సేవకు వచ్చిన మనిషి ఓపికగా

తన పని చేయాలికదా?) ఇంతకీ తిండిపెట్టమంటే విసుక్కున్న విదేశస్థురాలు కెనడాకు చెందిన అనా గంజా (Ana Ganza).ఈవిడ Journey of hope అనే పేరుతో థెరిసా జీవిత చరిత్ర రాసింది!

1975 ' 85 మధ్యకాలంలో తాను చేయని ఘనకార్యాల గురించి కూడా నోటికి వచ్చిన అబద్ధమల్లా చెప్పిన థెరిసా 1980 తరువాత వ్యూహాన్ని కాస్త మార్చారు. ఈ అబద్ధాలు చెప్పే పని కాథలిక్ మీడియా సమర్థవంతంగా నిర్వర్తిస్తుండడంతో థెరిసా రూటు మార్చారు. ఏప్రిల్, 1988 లండన్ పర్యటనలో థెరిసా ధోరణిలో తేడా కనిపిస్తుంది. 'భక్తి'గా తన చుట్టూ మూగిన జర్నలిస్ట్‌లతో థెరిసా ఇలా అన్నారు "సమాజపు నిర్లక్ష్యానికి గురై ఒంటరిగా మిగిలిన వారి పరిస్థితి దారుణంగా ఉంటుంది. ఎముకలు కొరికే చలిలో కప్పుకోడానికి ఏమీలేక వణికే నిరుపేదల్ని చూస్తే నా గుండె కరిగిపో తుంది. కళ్ళు నీటితో నిండిపోతాయి. అలాంటి ఒక వ్యక్తి దగ్గరకు నేను వెళ్ళినప్పుడు అతను నన్ను చూసి 'ఆదుకునే చేతిని అందుకుని ఎన్ని ఏళ్లయింది' అన్నాడు." ఈ మాటలు అంటున్నప్పుడు థెరిసా హావభావాలు, ఆమె స్వరం అందరినీ కట్టిపడేశాయి. థెరిసా ఎంత గొప్ప మానవతావాది అని అనుకునేలా చేశాయి. నిజానికి అప్పటి లండన్ పర్యటన ప్రధాన లక్ష్యం అబార్షన్ (గర్భస్రావం) నిషేధించాలంటూ బ్రిటన్ ప్రధాని థాచర్‌పై ఒత్తిడి తేవడమే. అబార్షన్ వ్యతిరేక లాబీ ఇచ్చిన సొమ్ముతో లండన్‌లో పర్యటించిన థెరిసా అబార్షన్ వ్యతిరేక ఉద్యమం గురించి మాట్లాడకుండా వీధుల్లో వణుకుతున్న నిరుపేదల గురించి ఎందుకు వాపోయారు? ఎందుకంటే ఇంగ్లండ్ ప్రజానీకానికి అబార్షన్ పెద్ద పట్టించుకునే విషయం కాదు. పైగా ఆ దేశంలో ఎక్కువమంది అబార్షన్‌వల్ల నష్టం లేదని భావిస్తారు. ఇలాంటి పరిస్థితిలో తానుఅబార్షన్ వ్యతిరేక ఉద్యమం కోసం వచ్చానంటే ఎవరూ పట్టించుకోరని గ్రహించి థెరిసా ఆ విషయాన్ని దాచిపెట్టి నిరుపేదల కోసం మొసలికన్నీరు కార్చారు. సేవా స్వరూపిణి, మానవతామూర్తి అని ప్రపంచంలో ఎంతోమంది అభిమా నాన్ని పొందిన మదర్ థెరిసా ఇలాంటి మోసపూరిత పద్ధతుల్ని అనుసరించిందని చాలామందికి తెలియదు. మదర్ థెరిసా చెప్పిన మరో పచ్చి అబద్ధం మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ప్రభుత్వం నుంచి ఎలాంటి సహాయం తీసుకోలేదని, తీసుకోదని అనడం. కానీ నిజానికి మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి కోల్‌కతాలో ఉన్న భవనాల్లో నూటికి 95 ప్రభుత్వ ఇచ్చినవే. కోల్ కతాలో థెరిసా మొట్ట మొదటగా ప్రభుత్వం నుంచి భవనాన్ని ఎలా పొందిందో ఆమె జీవిత చరిత్రల్లో ఉంది.

“ నేను మున్సిపల్ ఆఫీస్‌కు వెళ్ళి ఒక వసతి కోసం అడిగాను. జనాన్ని పోగుచేసేందుకు నాకు కొంత స్థలం చూపిం చండి చాలు మిగిలినదంతా నేను చేసుకుంటానని చెప్పాను. అప్పుడు మున్సిపల్ కార్పొరేషన్ అధికారి నన్ను కాళీ దేవాలయానికి తీసుకువెళ్ళారు. అక్కడ ఒక గది చూపించి అదే నేను మీకు ఇవ్వగలిగినది అన్నాడు. అప్పుడు నేను పరవాలేదు ఇలాంటి వసతే నేను కోరుకున్నది అని జవాబిచ్చాను.” మదర్ థెరిసావంటి కాథలిక్ మత ప్రచారకురాలికి కాళీ దేవాలయంలో స్థలం కేటాయించడంలో బెంగాల్ మార్క్సిస్టు ప్రభుత్వపు హిందూవ్యతిరేకత, అలాంటి స్థలమే తనకు కావలసింది అనడంలో థెరిసా మతప్రచార ఉద్దేశ్యాలు బయటపడతాయి.

మొదట్లో చికిత్స అందించిన ప్రతిరోగి ఖర్చులకింద మున్సిపల్ కార్పొరేషన్ కొంత మొత్తం థెరిసాకు ఇచ్చేది. ఇలా కొన్నిఏళ్ళు జరిగింది. అందుకనే నిర్మల్‌హృదయ్ పేరుతో పాటు కలకత్తా కార్పొరేషన్ అని కూడా ఉండేది. ఈ బోర్డు మగ్గరిడ్జ్ రూపొందించిన సినిమాతోపాటు గోరీ (Gory), బార్బీ (Barby) రాసిన థెరిసా పుస్తకం (1971)లోని ఫొటోలో
కనిపిస్తుంది. ఇప్పటికీ ఆ బోర్డు నిర్మల్‌హృదయ్‌లో ఉంది. దేవాలయంలోని సత్రాన్ని ఒక నెలకోసం వాడుకునేందుకు మున్సిపల్ అధికారులు ఇచ్చారు. దానితోపాటు కొంత డబ్బు కూడా ఇచ్చారు. కోల్‌కతా డమ్‌డమ్ విమానాశ్రయానికి దగ్గరలో ఉన్న థెరిసా హెూమ్ కూడా ప్రభుత్వ స్థలంలోనే ఉంది. ఇక తంగ్రా (Tangra)లో ఉన్న ప్రభుత్వ స్థలానికి ఏడాదికి రూపాయి అద్దె చెల్లిస్తోంది మిషనరీస్ ఆఫ్ ఛారిటీ. కోట్ల డాలర్ల నిధులు ఉన్న ప్పుడు ఆ స్థలాన్ని కొనేయ కుండా అద్దె ఎందుకు చెల్లిస్తున్నట్లు? “స్థలం కార్పొరేషన్ చేతిలో ఉంటేనే మేలు. లేకపోతే అక్కడ రోడ్లు తరుచు పాడై పోతే వాటిని బాగుచేసే ఖర్చు మనం భరించవలసివస్తుంది” (Mother Teresa, A Woman In Love p.165) అనేది ఆమె వ్యూహం. పేరు థెరిసాది. ఖర్చు ప్రభుత్వానిది, అంటే హిందువులది. ఇలా ప్రభుత్వం నుంచి చవకగా తీసుకున్న స్థలంలో ఛారిటీ సంస్థ పెద్ద భవనం నిర్మించింది. ఆ భవనంలో కూడా ఎలాంటి సేవాకార్యక్రమాలు నిర్వహించ కుండా కేవలం సంస్థకు చెందిన క్రైస్తవ బ్రదర్స్ నివాసం కోసం ఉపయోగిస్తోంది. విచిత్రమేమిటంటే మతమంటే మత్తుమందు అని గంగవెర్రులెత్తిపోయే కమ్యూనిస్టులు, ఎప్పుడూ సెక్యులరిజం మంత్రం జపించే వారి బెంగాల్ ప్రభుత్వం థెరిసా మత సంస్థకు మాత్రం ఎక్కడలేని రాయితీలు ఇచ్చారు, ఇస్తున్నారు. ప్రభుత్వమేకాదు హిందువులు వ్యక్తిగతంగా కూడా థెరిసాకు

సహాయం అందించారు. నీమ్‌తలా వీధిలోని ఛారిటీ హోమ్ భవనం స్థానిక సంగనేరియా కుటుంబం దానం చేసినదే. ఇలా ఎడాపెడా ప్రభుత్వం నుంచి, వ్యక్తుల నుంచి నిధులు, భవనాలు అప్పనంగా పొందిన థెరిసా గురించి మగ్గరిడ్జ్ వంటివారు మరోలా ప్రచారం చేశారు.`Something Beautiful for God` అనే పుస్తకంలో - 'ఆమె (థెరిసా) ఎప్పుడూ ప్రభుత్వం నుంచి ఎలాంటి గ్రాంట్ పొందలేదు' అని రాశాడు (పేజీ.32). కానీ అదే పుస్తకంలో మరోచోట నిజం బయటపెట్టేశాడు. 'ప్రభుత్వం ఇచ్చిన భూమిలో శాంతి కేంద్రాన్ని ఏర్పాటు చేసేందుకు ప్రయత్నిస్తున్నాం' అంటూ థెరిసా చెప్పినట్లు వెల్లడించాడు. (పేజీ. 103). తాము ఎన్నిసార్లు, ఎక్కడెక్కడ, ఏ అబద్ధం చెప్పారో తెలియక థెరిసా ప్రచారకర్తలు వారికి తెలియకుండానే ఇలా నిజాలు బయటపెట్టేస్తూ ఉంటారు. **చర్చ్ నుంచి ప్రభుత్వం నుంచి అనేక నిధులు, భవనాలు పొందిన థెరిసా వాటిని మతకార్యక్రమాలకే ఉపయోగించారు. అమెరికా, ఇటలీ తదితర దేశాల్లో కూడా ఆమె కార్యకలాపాలు మతపరమైనవే. ఆ మాట స్వయంగా థెరిసాయే ఒప్పుకున్నారు. ఆ మతకార్యక్రమాల లక్ష్యం కూడా మతమార్పిడే.** తన గురించి పుస్తకం రాస్తానంటూ మొట్టమొదటసారి ముందుకు వచ్చిన ఎడ్వర్డ్ లే జోలీతో థెరిసా ఇలా అన్నారు - "రాయండి, రాయండి. మమ్మల్ని చాలామంది అపార్థం చేసుకుంటున్నారు. మా పని గురించి అపోహలు ప్రచారం చేస్తున్నారు. మేమేమీ నర్సులు, డాక్టర్లు, టీచర్లం కాదు. సామాజిక కార్యకర్తలం అసలేకాదు. మేమంతా మతపరమైనవారం (మతకార్యకర్తలం)". (Angelo Devananda, Daily Prayers with Mother Teresa, Fount, 1987, p. 91) **కాథలిక్ చర్చ్ కార్యకలాపాల్ని సేవ ముసుగులో కొనసాగించిన థెరిసా గురించి ఇలాంటి నిజాలు ఎన్నో బయటపడ్డా జనం మాత్రం ఆమెను సేవాస్వరూపిణిగానే కొలి చారు.** అదే విచిత్రం. ప్రపంచంలో తిమ్మినిబమ్మిని చేయగలిగినది రాజకీయనాయకులని మనం అనుకుంటూ ఉంటాం. అలాంటి నక్కజిత్తుల నైపుణ్యం కలిగిన మదర్ థెరిసా కూడా ఒక రాజకీయ నాయకురాలే. ఆమె వాటికన్ (చర్చ్) పార్టీ కోసం నిస్వార్థంగా పనిచేసింది!

+++

# సంక్షేమ కేంద్రాలా? నరకకూపాలా?

పపువా న్యూ గినియా (Papua new Guinea) దేశపు జనాభా ముప్పై లక్షలు. ఈ దేశంలో చదరపు కిలోమీటరుకు 8 మంది మాత్రమే ఉంటారు. కోల్‌కతా నగరంలో ఈ దేశంకంటే మూడురెట్ల అధిక జనాభా ఉంటుంది. ఇలాంటి చిట్టి దేశంలో మదర్ థెరిసా మిషనరీస్ ఆఫ్ చారిటీకి ఏకంగా ఎనిమిది సెంటర్లు ఉన్నాయి. ఆ దేశంలోని వనిమో పట్టణం (నిజంగా చెప్పాలంటే పల్లెటూరు)లోనే మూడు సెంటర్లు ఉన్నాయి. ఈ విషయాన్ని అంతర్జాతీయ మీడియా ఆశ్చర్యంగాచెపుతూ ఉంటుంది. కానీ అసలు సంగతేమిటంటే ఈ ఎనిమిది సెంటర్లు పూర్తిగా క్రైస్తవ సన్యాసినుల మఠాలు. వీటిలో రోగపీడితులకి, అనాథలకి చోటు లేదు. అంత మారుమూలన ఉన్న అంత చిన్న దేశంలో అన్ని సెంటర్లు పెట్టడానికి కారణం ఏమిటి? వాటిలో స్థానిక మహిళలను క్రైస్తవ సన్యాసినులు (నన్స్)గా మారుస్తారు. వీటి ద్వారానే స్థానికుల్ని 'క్రీస్తుపట్ల ఆకలిగొన్నవారి'గా తయారుచేస్తారు. క్రైస్తవ సన్యాసినులుగా మారాలనుకున్న వారిని 'అభ్యర్థులు' (Candidates) అంటారు. ఆ తరువాత వీరు ఫిలిప్పీన్స్‌లో 'నావైస్' (novices) గా మారుతారు. వీరికి ఒక్కటే పని.

అది 'క్రియాశీలంగా' (active) ఉండడం. క్రియాశీలంగా ఉండడమంటే పేదసాదలకు, రోగిష్టివారికి సేవ చేయడం కాదు. కేవలం వీధుల్లోకి వెళ్ళి జనాన్ని చూడడం. ఈ చూడడం ఏమిటి? తమ మత ప్రచారాన్ని సాగించడంతోపాటు, ప్రచారం చేయగలిగిన 'అభ్యర్థుల్ని' (Candidates) వెతకడం. స్థానిక గిరిజనుల మనసులు మార్చడం.

**భారతదేశంలోనేకాదు ప్రపంచంలో ఎక్కడైనా గిరిజన జాతులకు 'దివ్యసందేశం' వినిపించడానికి థెరిసా ఎంతో ఉత్సాహం, పట్టుదల చూపేవారు.** పపువా న్యూ గినియాలో పేదలు, కష్టాల్లో ఉన్నవారు ఎవరూ లేరా?... ఉన్నారు.అయినా థెరిసావంటివాళ్ళు మత మార్పిడి కార్యక్రమాలకే పరిమితమైనా అక్కడ అడిగేవాళ్ళు ఎవరూ లేరు. కానీ భారత్‌వంటిపెద్ద దేశాల్లో అలా బాహాటంగా మతప్రచారం చేయడానికి వీలుండదు కాబట్టి 'సేవ' ముసుగులో సాగించారు. కోల్‌కతాలో మదర్ థెరిసా మొట్టమొదట ప్రారంభించిన సెంటర్ 'నిర్మల్ హృదయ్'. దీని గురించి థెరిసా ఎంతో గొప్పగా చెప్పుకునేవారు. ప్రాణాంతక వ్యాధులతో బాధపడుతూ అవసానదశలో ఉన్నవారికి సంరక్షణ అందించడమే ఈ కేంద్రం

పని. అలాంటి కేంద్రాల్ని వైద్యపరిభాషలో హాస్పైస్ సెంటర్లు (Hospice centres) అంటారు. అయితే పేరులోఉన్న నిర్మలత్వం, స్వచ్ఛత మాత్రం ఇక్కడేకాదు, ఇక్కడ పనిచేసే సిస్టర్లలో కూడా మచ్చుకైనా కనిపించవు. ఈ మాట అక్కడ పనిచేయడానికి వచ్చిన విదేశస్థులు చెప్పారు. నిర్మల్‌హృదయ్‌లో పరిస్థితులు సరిగా లేవని తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. అక్కడి వాతావరణం గురించి కాథలిక్‌లు కాని వాలంటీర్లు తీవ్ర ఆగ్రహం వెల్లడిస్తే, కాథలిక్కులు మింగలేకకక్కలేక అసంతృప్తితో సరిపెడతారు. నిర్మల్ హృదయ్ చాలా చిన్న సెంటర్. బయటనుంచి చూస్తే కొత్తవారికి అక్కడ సెంటర్ ఉన్నట్లే తెలియదు. అది కాళీమాత దేవాలయంలో భాగమనే అనుకుంటారు. పైగా సెంటర్‌కి అన్నివైపులా దుకాణాలు ఉంటాయి. 30 మీటర్ల వెడల్పు కూడా లేని నిర్మల్‌హృదయ్‌లో 17 మీటర్ల పొడవు, 6 మీటర్ల వెడల్పు ఉన్న రెండు గదులు ఉంటాయి. ఒక గదిలో పురుషులు, మరొకదానిలో స్త్రీ రోగులు ఉంటారు. ఇలాంటి చిన్న వసతిలో 'వేలాదిమంది'కి సంరక్షణ అందించేవారమని థెరిసా గొప్పగా చెప్పేవారు. అలా చెప్పి ప్రపంచాన్ని నమ్మించగలిగారు. అదే థెరిసా మాయ! క్రైస్తవ మీడియా మాయ! నిర్మల్‌హృదయ్‌ను చూసేందుకు వచ్చిన అనేకమంది విదేశీప్రముఖులే అది ఎంత చిన్నదో చెప్పకచెప్పారు. 'నిర్మల్ హృదయ్‌లోని ఒక గదిలో రెండు వరుసల్లో మంచాలు కనిపించాయి. ఈ గదిలో 50 మందికిమించి పట్టరు' అని కాలిఫోర్నియా గవర్నర్ జెర్రీ బ్రౌన్ అన్నారు (లైఫ్ పత్రిక, ఏప్రిల్, 1988). పోప్‌సందర్శించినప్పుడు కూడా నిర్మల్‌హృదయ్‌లో '42మంది పురుషులు, 44 మంది మహిళలు' మాత్రమే ఉన్నారు(టైమ్స్ పత్రిక 4, ఫిబ్రవరి, 1986). బ్రిటిష్ పత్రిక డైలీ టెలిగ్రాఫ్ కూడా ఇలాగే రాసింది - 'నిర్మల్‌హృదయ్ రోగుల కోసం పోప్ విందు ఇచ్చారు. 36 మంది పోప్ ఆశీస్సులు అందుకున్నారు' (ది డైలీ టెలిగ్రాఫ్, 4, ఫిబ్రవరి, 1986). ఇలాంటి అతి చిన్న సెంటర్ గురించి క్రైస్తవ మీడియా మాత్రం అద్భుతంగా ప్రచారం చేసింది. 'స్వచ్ఛమైన తెల్లని రంగుతో, అద్భుతమైన శిఖరాలతో, విశాలంగా ఉన్న భవనం చుట్టూ ఎంతో విశాలమైన పెరడు ఉంది' అని థెరిసా జీవితచరిత్రలో గొప్పగావర్ణించారు రచయితలు (Eileen Egan, Such A Vision of the Street, p.1) ఇలాంటి ఇరుకైన గదుల్లో రోగులుపడే బాధ వర్ణనాతీతం. అతిచిన్న బెడ్‌లపై ఎప్పుడూ పడుకునే ఉండాల్సిన పరిస్థితి. లేచి కూచోడానికి కూడా వీలులేదు. అటుఇటు తిరిగే అవకాశం లేదు. ఒకవేళ అలా చేయడానికి ప్రయత్నిస్తే వెంటనే సిస్టర్ల గదమాయింపుకు గురికావలసిందే. గట్టిగా చెపితే వినకపోతే వాళ్ళు రోగులపై చేయి చేసుకోవడం కూడా

మామూలే. వీళ్లని పేరుపెట్టి కాకుండా నెంబర్లతో పిలుస్తారు. జీవితపు అవసానదశలో ఉన్నవారిపట్ల సిస్టర్లు చూపే 'కారుణ్యం', 'అభిమానం' అలాంటివి! నిర్మల్‌హృదయ్ లోపల, చుట్టుపక్కల దిగజారుతున్న పరిస్థితుల దృష్ట్యా మరొక విశాలమైన స్థలాన్ని ఇవ్వడానికి రాష్ట్రప్రభుత్వం ముందుకు వచ్చింది. కానీ కాళీఘాట్ అంటే 'ప్రత్యేక అభిమానం' కలిగిన థెరిసా ఆ ఆఫర్‌ను తిరస్కరించారు. హిందువులను, వారి మతాన్ని కించపరచడానికి, వాళ్ళ మతకేంద్రంలోనే తాను తిష్టవేశాననే అవమానపూరిత సంకేతాన్ని ప్రపంచానికి పంపడానికి థెరిసాకు అదొక మహత్తర అవకాశం. అమె వంటి నిష్పాపరు     రాలైన క్రైస్తవి అలాంటి అవకాశాన్ని వదులుతుందా! అదే కోల్‌కతాలో అత్యంత సంపన్నులు ఉండే పార్క్ స్ట్రీట్‌లో 8  మిలియన్ డాలర్ల విలువైన ఆర్చ్‌బిషప్ పాలెస్‌లోకి నిర్మల్‌హృదయ్‌ను తరలించే అవకాశమున్నా థెరిసా ఆ పని చేయ లేదు. కానీ ఎప్పుడు, ఎక్కడ పెద్దపెద్ద భవనాలు, రాజుల నివాసాలు కనిపించినా 'ఇలాంటి భవనాలు నాకు ఇస్తే పేదలతో నింపేసేదాన్ని' అని చెప్పేవారు. ఇథియోపియాకు వెళ్ళినప్పుడు అక్కడి హైలీసెలాసీ అనే ఒకప్పటి రాజుకు చెందిన విశాలమైన భవనాన్ని చూసి థెరిసా కళ్ళు మెరిసాయి ' మీరు (జర్నలిస్టులు) ఈ భవనాన్ని శుభ్రం చేసేందుకు సిద్ధపడితే, నేను ఇక్కడ కార్యక్రమాలు చేపడతాను' అని అన్నారు. భవనమేమో థెరిసాది, జర్నలిస్టులు వాటిని ఊడ్చాలిట! నిర్మల్‌హృదయ్‌లో పనిచేసే స్వచ్ఛంద కార్యకర్తలు అనుసరించవలసిన నిబంధనలు చూస్తే వాళ్ళు బాధితులకు చేసే 'సేవ' ఎలాంటిదో తెలిసిపోతుంది. వ్యాధిగ్రస్తులకు ఇంజెక్షన్‌లు ఎలా ఇవ్వాలన్నది ఆ నిబంధనల్లో ఒకటి. 'ఇంజెక్షన్  సూదుల్ని బయటపారేయకూడదు. వాటిని వెంటనే కుళాయి కింద కడిగి భద్రపరచాలి'. నిర్మల్‌హృదయ్ ప్రారంభమైనప్పటి నుంచీ ఇదే పద్ధతి అనుసరిస్తున్నారు. వాడిన సిరంజిలు మళ్ళీ ఉపయోగించడం మంచిదికాదని, దీనివల్ల ఎయిడ్స్‌వంటి ప్రాణాంతక వ్యాధులు ప్రబలుతాయని తెలిసినా ఈ పద్ధతికి స్వస్తి చెప్పలేదు. 'నిరుపేద శరీరం జీసస్   శరీరం ఒకటే' అని ప్రకటించిన థెరిసా తన కేంద్రంలో వాడేసిన సిరంజిలనే మళ్లీ ఉపయోగిస్తున్నా ఏమీ అనేవారు కాదు. పైగా ఆమె ఒక్కమాట చెపితే లక్షల సిరంజ్‌లు తెచ్చి కుప్పపోసేందుకు అనేకమంది ముందుకు వచ్చేవారు. ఒకసారి కోల్‌కతా పర్యటనకు వచ్చిన ప్రిన్స్ ఛార్లెస్ సిరంజి, సూదుల బాక్స్‌ను ఇవ్వడం ద్వారా ఈ సూచన చేశారు కూడా. జీసస్ శిలువ మీద బాధపడితే రోగులు సిరంజిలవల్ల బాధపడాలనుకున్నారు కాబోలు మదర్‌థెరిసా. నిజానికి బాధల   ద్వారా జీసస్‌కు దగ్గర కావచ్చనే మూఢనమ్మకం థెరిసాకు చాలా ఉండేది.

విదేశాల నుంచి వచ్చే అనేక డొనేషన్లలో వచ్చిన సిరంజిలు, సూదులు, చికిత్స పరికరాలను ఏమాత్రం వాడనిచ్చేవారు కాదు. క్షయ వ్యాధి త్వరగా వ్యాపిస్తుందని తెలిసినా, అలాంటి రోగులకు ఉపయోగించిన సూదులనే ఇతరులకూ ఉపయోగించేవారు. బాధ ద్వారా పాపం పోయి జీసస్‌కు దగ్గరవుతారని ప్రగాఢంగా నమ్మిన థెరిసా తనకు అనారోగ్యం చేస్తే మాత్రం స్పెషలిస్ట్‌ల ద్వారా చికిత్స పొందే వారు. ఒకప్పుడు థెరిసాతో పనిచేసిన డా. జాక్ ప్రెగర్ (Dr.Jack Preger) (స్వయంగా కాథలిక్ అయిన ప్రెగర్ ఆ తరువాత చారిటీ కలకత్తా రెస్క్యూ అనే మరొక సేవాసంస్థను ప్రారంభించాడు) ఆమె ద్వంద్వ విధానం గురించి ఇలా వెల్లడించాడు - "తమకు మరింత మెరుగైన చికిత్స, మందులు కావాలని నిర్మల్‌హృదయ్ రోగులు ఎప్పుడైనా అడిగితే నిర్మొహమాటంగా తిరస్కరించేవారు. మతప్రచారం, క్రీస్తు ప్రార్థన తప్ప మరొక విషయానికి ప్రాధాన్యతనిచ్చేవారు కాదు. ఎంత బాధపడుతున్నా పెయిన్ కిల్లర్ మాత్రలు మాత్రం ఇచ్చేవారు కాదు. దేవుడే కల్పించుకుని బాధ తగ్గిస్తాడని నమ్మకం. కాళీఘాట్ (నిర్మల్‌హృదయ్) సెంటర్‌లో అనుసరిస్తున్న ఘోర మైన చికిత్స పద్ధతులు చూసి విదేశీ పరిశీలకులు నిర్ఘాంతపోయేవారు. టిబి పేషెంట్లకు వాడిన సూదులతోనే ఇతరు లకు ఇంజెక్షన్ ఇచ్చేవారు. ప్రముఖ మెడికల్ జర్నల్ (వైద్యపత్రిక) ది లాన్సెట్ (The Lancet) ఎడిటర్ డా. రాబిన్ ఫాక్స్ (Robin Fox) కూడా నిర్మల్‌హృదయ్‌లో పద్ధతుల గురించి, రోగ నిర్ధారణకు అవసరమయ్యే డయాగ్నొస్టిక్ టెస్ట్‌ల పట్ల చూపే విముఖత్వం గురించి తన ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు.నిర్మల్‌హృదయ్‌లో తాను చూసిన పరిస్థితుల గురించి ది లాన్సెట్ (17,సెప్టెంబర్, 1994) సంచికలో ప్రచురించిన రిపోర్ట్‌లో వివరించారు. ' డాక్టర్లు అప్పుడప్పుడు వచ్చిపోతుంటారు. సిస్టర్లు,వాలంటీర్లే రోగులకు వైద్యం చేస్తుంటారు. తీవ్రమైన జ్వరంతో బాధపడుతున్న ఒక యువకుడిని చూశాను. అతనికి టెట్రాసైక్లిన్, పారాసెటమాల్ ఇచ్చారు. కానీ ఆతరువాత డాక్టరు పరీక్షించి అతనికి మలేరియా జ్వరమని క్లోరోక్విన్ ఇవ్వాలని సూచించారు. ముందుగానే రక్తపరీక్ష చేయిస్తే ఈ సంగతి తెలిసేది. కానీ ఇలాంటి పరీక్షలకు థెరిసా చాలా దూరం. ఇలాంటి పరీక్షలు దేవుని నుంచి మనను దూరం చేస్తాయని ఆమె ప్రగాఢ విశ్వాసం. అందుకని ఎక్కడా ఇలాంటి పరీక్షలకు థెరిసా ఒప్పుకునేవారు కాదు. నెప్పి, బాధ దేవునికి దగ్గర చేస్తాయని ఆమె అభిప్రాయం. అందుకే నిర్మల్‌హృదయ్‌లో నామమాత్రపు వైద్యంతోనే సరిపెడుతున్నారు తప్ప రోగాలకు పూర్తి స్థాయిలో చికిత్స అందించడం లేదు.' (The Missionary position, Christopher Hitchens, Harper Collins, p.38,39)

నిర్మల్‌హృదయ్ తదితర సెంటర్లలో ఇలా నామమాత్రపు వైద్యంతోనే సరిపెట్టిన మదర్ థెరిసా తన విషయాని కొచ్చేసరికి మరోలా ప్రవర్తించేవారు. తన ఆరోగ్యం విషయానికొచ్చేసరికి మాత్రం థెరిసా ఎక్కడలేని జాగ్రత్త తీసుకునేవారు. దేవుడిమీద భారం ఏమాత్రం వేసేవారు కాదు. గుండెలో పేస్‌మేకర్ అమర్చడానికి విదేశాల నుంచి హార్ట్‌సర్జన్‌లను పిలిపించారు. ఆపరేషన్ తరు వాత అత్యంత అధునాతనమైన ఉడ్‌లాండ్స్ ఆసుపత్రిలో చికిత్స తీసుకున్నారు. అంతేకానీ కాళీఘాట్ సెంటర్ చాలనుకోలేదు (Jeremy Joseph Dr. Jack Calcutta`s pavement Doctor, Bloomsburry, 1991,p141-142). ఉడ్‌లాండ్ ఆసుపత్రిలో తాను పొందుతున్న అధునాతన, సౌకర్యవంతమైన చికిత్స గురించి బయట ప్రపంచానికి తెలియకుండా థెరిసా చాలా జాగ్రత్తలు తీసుకునేవారు. వాలంటీర్లు ఎవరూ తనను చూడటానికి అసుపత్రికి రావడానికి వీలులేదని కఠిన నిబంధన విధించారు. ఒకవేళ వాళ్లు వస్తే తన బండారం బయటపడిపోతుం దని ఆమె భయపడేవారు. నిర్మల్‌హృదయ్ సెంటర్‌లో రోగులపట్ల అనుసరిస్తున్న అనారోగ్యకరమైన, ప్రమాదకరమైన పద్ధతులపై అక్కడ పని చేయడానికి వచ్చిన విదేశీ వాలంటీర్లు ఆందోళన వ్యక్తం చేసేవారు. 1989 - 90లో నిర్మల్ హృదయ్‌లో వాలంటీర్‌గా పనిచేసిన టిమ్ స్టిల్‌వెల్ (Tim Stillwell) నిర్మల్ హృదయ్ చికిత్సాలయం, సంరక్షణ కేంద్రంలా కాక 'కాన్సన్ ట్రేషన్ క్యాంప్'లా ఉండేదని అన్నారు. అక్కడ 'చికిత్స పొందడం' కంటే వీధుల్లో పడి ఉండడమే మేలని అనుకునేట్లుగా అక్కడి పరిస్థితులు ఉండేవని చెప్పారు. నన్స్ అనుసరించే చికిత్సవిధానం చాలా దారుణంగా ఉండేదని టిమ్ వాపోయాడు. అయితే వాళ్ళు బహిరంగంగా ఈ విషయాన్ని చెప్పేవారు కాదు. కొందరు 'మనకు ఎందుకులే' అని ఊరుకునేవారు. మరికొందరు థెరిసా సెంటర్ వంటి 'అంతర్జాతీయ సంస్థ' లో పనిచేసిన 'అనుభవం' గడించేందుకు, అది తమ బయోడేటాల్లో రాసుకునేందుకు అక్కడికి వచ్చేవారు. నిర్మల్‌హృదయ్‌లో అనా రోగ్యకరమైన చికిత్సతోపాటు బలవంతపు మతమార్పిడి పద్ధతులు కూడా అమలులో ఉండేవని టిమ్ స్టిల్‌వెల్ చెప్పాడు.రోగుల్లో ఎక్కువమంది హిందువులు అయినా సెంటర్‌లో ఎక్కడా హిందూ దేవతల చిత్రాలు ఉండవు. అది గమనించినటిమ్ రోగుల కోసం హిందూ దేవతల చిత్రపటాలు తెచ్చి గోడలపై అతికించాడు. రోగులు సంతోషం వ్యక్తం చేశారు కూడా. కానీ మర్నాడు ఆ పటాలు కనిపించకపోయేసరికి అవి ఏవని టిమ్ ప్రశ్నిస్తే 'గోడలు శుభ్రంగా ఉంచేందుకు వాటిని తొలగించా'మని సిస్టర్లు సమాధానమిచ్చారు! క్రైస్తవేతర మతాలను కూడా సమానంగా గౌరవిస్తామని,

గౌరవించా లని గొప్పగా స్టేట్‌మెంట్‌లు ఇచ్చిన థెరిసా అందుకు పూర్తి విరుద్ధంగా ప్రవర్తించేవారు. **హిందు, ముస్లిం రోగుల్ని రహస్యంగా ఎలా మతం మార్చాలో (బాప్తిజం చేయాలో)** సిస్టర్లకు **చెప్పేవారు.** మిషనరీస్ ఆఫ్ చారిటీ సంస్థలో 91/2 ఏళ్ళు చురుగ్గా పనిచేసి, అక్కడి అమానుషమైన పద్ధతులను అంగీకరించలేక బయటకు వచ్చేసిన సుసాన్ షీల్డ్స్ అనే కాథలిక్ ఈ రహస్య బాప్తిజం గురించి ఇలా రాసింది - "ప్రాణాంతక వ్యాధులతో అవసానదశలో ఉన్న వారిని రహస్యంగా ఎలా బాప్తిజం చేయాలో సిస్టర్లకు మదర్ థెరిసా నేర్పారు. చనిపోనున్న వారిని 'నీకు స్వర్గానికి టికెట్ కావాలా' అని అడగాలి. రోగి అవును అని చెపితే బాప్తిజం చేయవచ్చును. రోగి తలపై తడిబట్ట ఉంచుతున్నట్లు నటిస్తూ సిస్టర్ బాప్తిజానికి సంబంధించిన మాటలు బయటకు వినిపించకుండా చెప్పేస్తుంది. ఈ మొత్తం ప్రక్రియ రహస్యంగానే జరిగిపోవాలి. హిందువులు, ముస్లిములను థెరిసా మతం మారుస్తున్నారని ఎవరికీ తెలియకూడదు". (Christopher Hitchens, Missionary Position, Verso, 1995, P.48) థెరిసాపై కోపం, కక్షతో సుసాన్ షీల్డ్స్ ఇలా రాసిందనుకున్నా **ఈ రహస్య మతమార్పిడి వ్యవహారాన్ని గురించి స్వయంగా మదర్ గొప్పగా చెప్పుకున్నారు.** 14, జనవరి, 1992 న గుండె ఆపరేషన్ తరువాత కాలిఫోర్నియా, స్క్రిప్ ఆసుపత్రిలో రెస్ట్ తీసుకుంటున్న థెరిసా అక్కడి డాక్టర్లు, నర్సులకు దివ్యసందేశం వినిపించారు. ఈ సందేశపు వీడియో లభిస్తోంది కూడా - "అన్నింటికంటే సంతోషించవలసిన సంగతేమిటంటే **చనిపోయినవారిలో ఏ ఒక్కరూ సెయింట్ పీటర్‌కు స్పెషల్ టికెట్ తీసుకోకుండా పోలేదు. బాప్తిజాన్నే మేం సెయింట్ పీటర్‌కు స్పెషల్ టికెట్ అని అంటాం.** చేసిన పాపాలు అన్నీ పోగొట్టుకుని, దేవుని పొందాలనుకుంటున్నావాఅని చనిపోతున్న వ్యక్తిని అడుగుతాం. అలా అడిగితే కాదనే వాళ్ళెవరూ ఉండరు. **1952లో సెంటర్ (కాళీఘాట్) ప్రారంభించిన నాటి నుంచి ఇప్పటి వరకూ ఇలా 29,000 మంది చనిపోయారు."** లేనివి ఉన్నట్లుగా, గోరంత కొండంత చేసి చూపించడం థెరిసాకు అలవాటు కనుక, ఎదురుగా ఉన్నది అమెరికన్లు కాబట్టి **అతిశయోక్తులు** (29,000 మంది ఒకే సెంటర్ నుంచి చనిపోయారు) **చెప్పారనుకున్నా** రహస్య **బాప్తిజం గురించి లేనిపోనివి చెప్తే తరువాత చిక్కుల్లో** పడాల్సి వస్తుందని తెలియనంత **అమాయకురాలు మాత్రం కాదు.** అసహాయ స్థితిలో, అవసానదశలో ఉన్న వ్యక్తులను మోసపూరితంగా ఇలా మతం మార్చడం ఎలాంటి 'సేవ'! పైగా అది గొప్పగా చెప్పుకోవడం ఇంకెంతటి 'ఘనకార్యం'! బతికున్నవారికే ఇంతటి సేవ చేసిన థెరిసాకు వాళ్ళు చనిపోయిన తరువాత విలువ, గౌరవం ఏముంటుంది? అందుకే

శవాలను భద్రపరచే గది (మార్చురీ)లో కనీసం రిఫ్రిజిరేషన్ (శీతలీకరణం) లేదు. ఫిబ్రవరి, 1992లో డయానా నిర్మల్ హృదయ్‌ను సందర్శించినప్పుడు ఆమెతోపాటు వ్యక్తిగత భద్రతాధికారిగా వచ్చిన కెన్ వార్ఫే (Ken Wharfe) ఈ మార్చురీని చూసి నిర్ఘాంతపోయాడు - "సంరక్షణ కేంద్రం (హెూస్పైస్)లో ఉన్న మార్చురీ అడుగుపెట్టడానికి వీలులేని ప్రదేశం. అంతటి దారుణమైన ప్రదేశాన్ని నా జీవితంలో ఎప్పుడూ చూడలేదు. అసలు మొత్తంమీద చూస్తే నాకు ఆ సంరక్షణ కేంద్రమే ఒక మార్చురీలా కనిపించింది." (Ken Wharfe, Diana, closely Guarded Secret, Micahel o`Mara books, 2002, p.147 - 148) మరొక సందర్శకురాలు ట్రేసీ లియనార్డ్ కూడా మార్చురీలో దారుణ పరిస్థితుల గురించి రాశారు. 'అక్కడ (మార్చురీలో) చావు, బతుకుల మధ్య చాలా సన్నని, పలుచని గీత ఉంటుంది.' (The Full Catastrophe, p.60). ఒకసారి కొనఊపిరితో ఉన్న రోగిని సిస్టర్లు ఎలా మార్చురీకి చేర్చేశారో, తరువాత పొరపాటు తెలుసుకుని తిరిగి వార్డుకు ఎలా తెచ్చారో లియనార్డ్ వివరించింది. మార్చురీ,మందుల సంగతి యేసు ఎరుగు కనీస సదుపాయాలు, శుభ్రత కూడా నిర్మల్‌హృదయ్‌లో కనిపించేవి కావు. కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో మానవశాస్త్రం చదివిన డాన్ లీటన్ (Dan Leighton) కొంతకాలం వాలంటీర్‌గా పనిచేసేందుకు 1990లో నిర్మల్‌హృదయ్‌కు వచ్చాడు.

థెరిసా చేసేస్తున్న దీనజన సేవలో పాలుపంచుకోవాలనే ఉత్సాహంతో వచ్చిన డాన్‌కి ఇక్కడికి వచ్చిన తరువాతగానీ అసలు సంగతి తెలియలేదు. నిర్మల్‌హృదయ్‌లో దారుణపరిస్థితి చూసి తీవ్ర అసంతృప్తి, నిరాశకు గురయ్యాడు. అదే సంగతి అక్కడ సిస్టర్లతో చెపితే 'ముందు ఇక్కడ పరిస్థితుల్ని అర్థం చేసుకో. ఆ తరువాత సలహాలు ఇవ్వవచ్చు' అని గదమాయించారు. కొన్ని రోజులు అక్కడ ఉన్న తరువాత డాన్‌కు నిజంగానే అక్కడి దారుణపరిస్థితి బాగా అర్థమైంది. తాము గిన్నెలు కడిగే ప్రదేశంలోనే రోగుల మలంతో నిండిన దుప్పట్లు శుభ్రం చేయడం అతనికి కంపరమెత్తించింది. ఆ మలం తాము కడిగే గిన్నెలపై పడడం అతను తట్టుకోలేకపోయాడు. కాస్త తమ (వాలంటీర్ల) మాట వినే సిస్టర్ లూక్‌కి పదేపదే మొరపెట్టుకుని గిన్నెలు కడిగే ప్రదేశంలో కాంక్రీట్ గోడ అడ్డంగా కట్టించాడు. గిన్నెలు కడిగేందుకు ప్రత్యేక ప్రదేశాన్ని ఏర్పాటుచేయగలిగాడుకానీ శుభ్రమైన నీళ్ళను మాత్రం తెప్పించలేకపోయాడు. కోట్లడాలర్ల నిధులున్న మిషనరీస్ ఆఫ్ చారిటీ ఆధ్వర్యంలో నడిచే ప్రపంచ ప్రఖ్యాతి పొందిన నిర్మల్‌హృదయ్ సెంటర్‌లో శుభ్రమైన

మంచి నీళ్లు లేవని తెలిసి డాన్ ఆశ్చర్యపోయాడు. అంతంతమాత్రంగా వచ్చే మున్సిపల్ నీళ్లతోనే పనికానిస్తున్నారని, కనీసం ఒక్క బోర్‌కానీ, నీళ్ళు పంప్ చేసేందుకు మోటార్‌కానీ లేవని తెలుసుకుని కంగారుపడ్డాడు. క్షయ, డయేరియా వంటి వ్యాధులున్నవారికి శుభ్రమైన నీళ్ళు కూడా లేవని గుర్తించాడు. పాచిపట్టిపోయిన నీళ్లలోనే గిన్నెలు కడిగేవారని వివరిం చాడు. నిర్మల్‌హృదయ్‌లో పరిస్థితి ఇంత దారుణంగా ఉంటే అక్కడ రోగులకు సేవ చేసే సిస్టర్ల తీరు మరింత అధ్వాన్నంగా ఉంది. సిరంజి సూదుల్ని కుళాయి నీళ్ల కింద కడిగి మళ్ళీ ఉపయోగించడాన్ని తీవ్రంగా వ్యతిరేకించిన డాన్ లీటన్ 'కడగకపోతే కొంపేమిమునిగిపోతుంది' అనుకునే నిర్లక్ష్యపు ధోరణి భరించలేకపోయాడు. "సిస్టర్లకి వైద్య పరి జ్ఞానం ఏమాత్రం లేదు. వారానికి ఒకరోజు కొన్ని గంటలకు స్థానిక డాక్టరు ఒకరు వచ్చి రోగుల్ని చూసి వెళిపోతారు.వాలంటీర్లు వచ్చివెళుతుంటారు తప్ప డాక్టర్లు ఎవరూ రారు. థెరిసా బతికున్నప్పుడే ఇంత దారుణంగా ఉంటే ఆమె తరువాత ఈ రోగుల పరిస్థితి ఏమిటని అనిపిస్తుంది. సిస్టర్లకు ప్రార్థనపట్ల ఉన్న శ్రద్ధ మందులు ఇవ్వడంలో లేదు. ప్రార్థనతోనే అన్ని బాధలు తీరిపోతాయనే థెరిసా సిద్ధాంతం నేనెక్కడా చూడలేదు. ఇది కాథలిక్ మతంలో కొత్త బ్రాండ్ కావచ్చు." ఈ ప్రార్థన ప్రాముఖ్యత గురించి బిబిసి డాక్యుమెంటరీ (Everyman)లో మెరీ మెడికల్ మిషనరీస్‌కు చెందిన సిస్టర్ ఉర్సులా (Sister Ursula) గొప్పగా చెప్పారు -

"ప్రార్థన ఎంత ముఖ్యమైనదంటే పిల్లలకు అన్నం పెడుతున్నప్పుడు ప్రార్థన సమయం అయితే ఆ చెంచా అలా వాళ్ల నోట్లోనే వదిలేసి సిస్టర్లు పరిగెత్తుతారు". నిర్మల్‌హృదయ్ మార్చురీ గురించి ప్రపంచానికి చెప్పిన ట్రేసీ లియనార్డ్ రోగులకు చికిత్స అందించడంలో నిర్లక్ష్యాన్ని గురించి కూడా రాసింది - "సిస్టర్లకు వైద్యం గురించి ఒక్కముక్క తెలియదు. పైగా వాళ్ళు ఎంత నిర్లక్ష్యంగా పని చేసేవారంటే ప్రెడ్నిసోలోన్ (Prednisolone) అనే స్టెరాయిడ్‌కి బదులు పారాసెటమాల్ (paracetamol) ఇవ్వడం నేను చూశాను. ఇదేమిటని అడిగితే రెండు మందులు 'పి' (p) అక్షరంతోనే మొదలవుతాయి కాబట్టి పొరపాటున ఒకదానికి బదులు మరొకటి ఇచ్చేశామని సమాధానం చెప్పారు. ఇలా చేయడం రోగుల్ని మందులతో చంపడమేకదా అని గట్టిగా అడిగితే 'అంతా దేవుని చేతిలో ఉంది' అంటూ నిర్లక్ష్యంగా నవ్వేవారు." (Full Catastrophe,p.60) కొందరు నర్సులైతే రోగుల్ని క్రూరంగా హింసించేవారు.

కాళీఘాట్ సెంటర్ (నిర్మల్‌హృదయ్) దగ్గరలోనే ఉన్న పూజారి దేవీ చరణ్ హల్దర్ స్థానిక పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఈ హింస గురించి చెప్పాడు - "మిషనరీస్ ఆఫ్ చారిటీకి చెందిన చాలామంది సిస్టర్లు రోగులపట్ల క్రూరంగా వ్యవహరించేవారు. ప్రతిరోజూ రాత్రి పొద్దుపోయిన తరువాత లోపల నుంచి రోగుల హృదయవిదారకమైన అరుపులు వినిపించేవి. సిస్టర్లు వారిని శారీరకంగా హింసించేవారు. మిషనరీస్ ఆఫ్ చారిటీ కార్యకలాపాలపై నాకు రెండు ఫిర్యాదులు ఉన్నాయి. అవి - 1) వాళ్ళు రోగులపట్ల మరింత సానుభూతితో వ్యవహరించాలి. తగిన వైద్యం అందించాలి. 2) ఉచిత భోజనానికి ఆశపడి వచ్చే ఆరోగ్యవంతుల్ని కూడా సెంటర్‌లో చేర్చుకోవడం మానుకోవాలి. ఆవిధంగా జనంలో బద్ధకాన్ని,అడుక్కుని తినే మనస్తత్వాన్ని పెంచకుండా ఉండాలి". (Calcutta Skyline, December, 1990)

డా. రిచర్డ్ డీన్ (Dr. Richard Dean) లండన్‌కు చెందిన డాక్టర్. ఈయన 1980లో కోల్‌కతాలోని మిషనరీస్ ఆఫ్ చారిటీలో వాలంటీర్‌గా పనిచేయడానికి వచ్చాడు. అందరిలాగానే థెరిసా ఇక్కడ ఎంతో అద్భుతమైన సేవ చేసేస్తోందని, అందులో తనకు చేతనైనంత పాలుపంచుకోవాలనే ఉద్దేశ్యంతో వచ్చాడు. కానీ కొన్ని వారాల్లోనే అతనిభ్రమలు తొలగిపోయాయి. తాను విన్నదానికి, ఇక్కడ చూస్తున్నదానికి పొంతనలేక చాలా గందరగోళానికి గురయ్యాడు. థెరిసా సేవ గురించి అసలు నిజం తెలుసుకునేసరికి అతనికి ఏకంగా కాథలిక్ మతం పైనే విశ్వాసం పోయింది. తిరిగిలండన్‌కు వెళ్లిన తరువాత కాథలిక్ మతాన్ని వదిలిపెట్టేశాడు. డీన్‌ను అంతగా డీలాపరచిన విషయాలేమిటో అతని మాటల్లోనే -

"కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో కాథలిక్ స్టూడెంట్స్ ఆర్గనైజేషన్ తరపున నేను కలకత్తా వచ్చాను. అప్పుడు నేను ఇంకా మెడిసిన్ చదువుతున్నాను. కలకత్తాలో నా బస హౌరాలోని ఛారిటీ సంస్థ బ్రదర్స్ నివాసంలో ఏర్పాటుచేశారు. బ్రదర్స్ (ఛారిటీ సంస్థలో పురుష కార్యకర్తలు) లో చాలామంది బీహారీలే. కొద్దిమంది తమిళనాడు, కేరళ వాళ్ళు కూడా ఉండే వారు. అయితే ఒక్క బెంగాలీ కూడా కనిపించలేదు. వీళ్ళంతా ఇంగ్లీషు బాగా మాట్లాడేవారు. మా నివాసానికి దగ్గరలోనే చర్చ్ ఉంది. ఉదయం.4.గం.లకు లేచి ప్రార్థన సమావేశానికి వెళ్ళేవాళ్ళం. అది చాలాసేపే జరిగేది. బ్రదర్స్‌కు కావలసిన సహాయం చేయమని నాకు చెప్పారు. మేము ఉన్న ఆవరణలోనే ధాన్యం, గోధుమలు రాశులు పోసి ఉండేవి. అవి అమెరికా నుంచి వచ్చాయని తెలిసింది. అలా వచ్చిన వాటిని ఎప్పటికప్పుడు పేద జనానికి పంచిపెట్టకుండా అలా ఎందుకు దాచారో నాకు అర్థం కాలేదు. కానీ ఆ చుట్టుపక్కల మురికివాడలో

నివసించే జనానికి మాత్రం అక్కడ ధాన్యం, గోధుమలు ముక్కిపోతున్నాయని తెలుసు. అందుకే ప్రతినెల కొందరు మా సెంటర్‌లోకి చొరబడి చేతికంది నంత పట్టుకు పోయేవారు. తిండిగింజలేకాదు మందులు కూడా మురిగిపోతూ ఉండేవి. 10, 12 ఏళ్ళనాటి మందుల్నే బ్రదర్స్ నిరభ్యంతరంగా రోగులకు ఇచ్చేవారు. క్రమంతప్పకుండా రోగులకు ఇలా సేవ చేసే బ్రదర్స్‌కి వైద్యం గురించి ఏమీ తెలియదని నేను గుర్తించాను. మందులేకాదు సూదులు కూడా చిరవురాతనవైనవే ఉపయోగించేవారు. అవి నిజానికి ఇంజెక్షన్ ఇవ్వడం కంటే చేపలు పట్టుకునేందుకు ఎరగా బాగా పనికివస్తాయి. సూదుల కొనలు మెలితిరిగిపోయి ఉండేవి. వాటిని చూస్తేనే నాకు భయం వేసేది. అలాంటిది వాటితో పొడిస్తే రోగులు ఇంకెంత బాధ పడేవారో! వంకర టింకర సూదులతో రోగుల్ని కుళ్లబడిచే బ్రదర్స్‌కు మాత్రం అత్యాధునికమైన వైద్యం అందుబాటులో ఉండేది. వాళ్లు ప్రతినెల చెకప్ కోసం స్థానిక అమెరికన్ ఆసుపత్రికి వెళ్ళేవారు. ఒక్కొక్కరికి చెస్ట్ ఎక్స్‌రే కోసం 10 పౌండ్లు (800 రూ.లు)ఖర్చు పెట్టేవారు. మొత్తం మీద బిల్లు 300 పౌండ్లకు పైనే అయ్యేది. ఈ ఖర్చు చూసి నేను ఒకసారి తక్కువలోనే చెకప్ పూర్తి చేసుకుని మిగిలిన సొమ్ముతో రోగులకు సరైన సూదులు, మందులు ఇవ్వవచ్చు కదా అని సలహా ఇచ్చాను.మదర్ థెరిసా గురించి నేను విన్నదానికి, ఇక్కడ చూసినదానికి పోలికే లేదు. తమ సంస్థలో పనిచేసే నన్స్, బ్రదర్స్ పేదవారితో సమానంగా జీవిస్తారని మదర్ చాలాసార్లు చెప్పగా విన్నాను. మరో సంఘటనతో నా భ్రమలన్నీ పూర్తిగా తొలగిపోయాయి. మదర్ నడుపుతున్న సెంటర్‌లో వరిబీజంతో బాధపడుతున్న ఒక రోగిన చూశాను. అతని బుడ్డ మోకాళ్ల వరకు వచ్చేసింది. అయినా అతన్ని ఎవరూ పట్టించుకోకపోవడం నాకు ఆశ్చర్యం కలిగించింది. అదే సంగతి బ్రదర్స్‌ను అడిగాను. 'ఒక్కరిని పట్టించుకుంటే సరిపోదు. ఇలా వేలమంది ఉన్నారు. వీరందరికీ ఖర్చు ఎక్కడ పెడతాం' అని సమాధానమిచ్చారు. ఇలాంటి సమాధానం మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సెంటర్లలో నాకు తరుచూ వినిపించేది. బ్రదర్స్‌తో లాభంలేదని నేనే ఆ రోగిని ఆస్పత్రికి తీసుకువెళ్ళాను. ప్రతినెల బ్రదర్స్ చెకప్ కోసం వెళ్ళే ఆస్పత్రికి తీసుకువెళితే వాళ్ల చూడలేము పొమ్మన్నారు. చివరికి ప్రభుత్వాసుపత్రికి తీసుకువెళ్ళాను. మొత్తానికి మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సెంటర్ల సందర్శన ఒక 'భయంకరమైన' అనుభవంగా మిగిలిపోయింది. నా పర్యటన చివరి రోజుల్లో బ్రదర్స్‌ను వదిలి దూరంగా వచ్చేశాను. అదే కలకత్తాలో ఛారిటీ సంస్థకంటే అతితక్కువ వనరులతో అద్భుతంగా సేవ అందిస్తున్న హిందూ సంస్థలను చూశాను. కాథలిక్ మతాన్ని వదిలిపెట్టడానికి నా ఈ

అనుభవకొంతవరకు కారణం. 1980 తరువాతఅనేకసార్లు కలకత్తాకు వచ్చాను. కానీ ఎప్పుడూ మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సెంటర్ల చాయలకు కూడా వెళ్ళలేదు.”

డాన్‌లీటన్, ట్రేసీ లియనార్డ్, రిచార్డ్ డీన్ వంటివారు థెరిసా చేస్తున్న మానవసేవను గురించి విని, ముగ్ధులై తామూ అందులో పాల్గనాలని వచ్చారు. తీరా ఇక్కడకు వచ్చిన తరువాత మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సెంటర్లలో జరుగుతున్నది సేవకాదు హింస అని తెలిసింది. ట్రేసీ అయితే కొంతకాలం సంస్థలో వాలంటీర్‌గా పనిచేశారు. థెరిసా వీరాభిమానిగా పేరుపడ్డారు. ఒకదశలో ట్రేసీ కూడా ఛారిటీ సంస్థ నన్‌గా మారతారని అనుకున్నారు. కానీ భ్రమలన్నీ తొలగిపోయిన తరువాత అదే ట్రేసీ సంరక్షణ కేంద్రాల్లో దారుణపరిస్థితుల గురించి విస్తృతంగా ప్రచారం చేశారు. ఇక డాన్ లీటన్ మదర్ థెరిసా, టైమ్‌ఫర్ ఛేంజ్ (Mother Teresa: Time for Change) అనే డాక్యుమెంటరీలో థెరిసా కార్యకలాపాలను తీవ్రంగా విమర్శించాడు. ఈ డాక్యుమెంటరీ 1997 సంవత్సరంలో యూరోపియన్ టెలివిజన్‌లో ప్రసారం చేశారు. మదర్ థెరిసా కార్యకలాపాలపై మొట్టమొదటసారిగా తీవ్ర అభ్యంతరాలు వ్యక్తం చేస్తూ మేరీ లౌడన్ అనే సామాజిక కార్యకర్త అబ్జర్వర్ (3,మే, 1992) పత్రికలో వ్యాసం రాసిందిా “కలకత్తాలో అంతకు ముందునుంచే పని చేస్తుండడంతో అక్కడ ఏం జరుగుతోందో నాకు తెలుసని అనుకున్నాను. కానీ అది తప్పని తేలింది. థెరిసా గొప్పగాచెప్పే కాళీఘాట్ (నిర్మల్‌హృదయ్) సెంటర్‌ను చూసి నిర్ఘాంతపోయాను. అందులో రెండు గదుల్లో మొత్తం 80 మందిఉ న్నారు. వారంతా మంచాలకు అతుక్కుని ఉన్నారు. సరైన ఆహారంలేక, తాగడానికి శుభ్రమైన నీళ్లు లేక నీరసించి ఉన్నారు. అక్కడే ఒక క్షయ రోగిని చూశాను. ఆమె కొన్ని రోజుల తరువాత చనిపోయింది. అయితే ఆమెకు కనీసపు వైద్యం అంది ఉ ంటే మరికొంతకాలం బతికి ఉండేదని ఆ సెంటర్‌లోనే పనిచేసిన అమెరికన్ డాక్టర్ చెప్పినప్పుడు ఆశ్చర్యపోయాను. ఎవరు, ఎంతకాలం బతకాలి, ఎప్పుడు చావాలన్నది దేవుడే నిర్ణయిస్తాడన్నది థెరిసా సిద్ధాంతం. ఆప రేషన్‌థియేటర్ కంటే స్వర్గంలోనే సుఖముందని ఆమె అభిప్రాయం. అందుకనే కోట్లాది డాలర్ల నిధులు కూడాబెట్టినా రోగులకు సరైన వైద్యం అందించడానికి థెరిసా ఏనాడూ ప్రయత్నించలేదు. క్యాన్సర్ రోగులకు ఆస్పిరిన్, క్షయ రోగు లకు లింక్టస్ మాత్రలతో సరిపెట్టేవారు. ఇక కోమాలో ఉన్నవారికి అపరిశుభ్రమైన సూదుల ద్వారా సెలైన్ మాత్రం ఇచ్చేవారు.ఇలాంటి వైద్యానికి తట్టుకోలేక చచ్చిన వాళ్ళు ఏమతస్థులైనా, కాథలిక్ ఆచారాల ప్రకారం అంతిమకర్మ చేయించేవారు.” ‘రోగులకు మందుకంటే ప్రార్థన ముఖ్యం. దేవుడే అన్నీ

చూసుకుంటాడు కనుక మనం మందులు వేయాల్సిన అవసరం లేదు' అనే సిద్ధాంతం కేవలం మదర్ థెరిసాతో పుట్టలేదు. నిజానికి అది ఆమె ఎంతో ప్రగాఢంగా విశ్వసించి, గుడ్డిగా అనుసరించిన క్రైస్తవ మతంలోనే ఉంది. ఈ విషయాన్ని ఆ మత ప్రచారకులే చెప్పుకున్నారు. 1980లో నిర్మల్‌హృదయ్‌ను సందర్శించిన జెసూట్ ఫాదర్ పాల్ చెత్‌కుటి (Paul Chetcuti) రోగులపట్ల చూపుతున్న అమానుషమైన నిర్లక్ష్యాన్ని చెపుతూనే, అలా చేయడం 'దేవుని కార్యం' అంటూ సమర్థించాడు. నిర్మల్‌హృదయ్‌లో తాను చూసిన విషయాలను చూజింగ్ టు సెర్వ్ ది డెస్టిట్యూట్ (Choosing to serve the Destitute) అనే పుస్తకంలో వివరించాడు.

"మిషనరీస్ ఆఫ్ చారిటీలో అసలు పనికంటే ప్రార్థనకే ప్రాధాన్యత ఎక్కువ. 'మనం సామాజిక కార్యకర్తలం కాదు' అని థెరిసా చెపుతుంటారు. నేను నిర్మల్‌హృదయ్‌కి వెళ్ళినప్పుడు కొనఊపిరితో ఉన్న ఒక రోగిని చూసి కంగారుపడ్డాను. సిస్టర్‌ను పిలిచి అతని సంగతి ఏమిటో చూడమన్నాను. అప్పుడు ఆమె అడిగిన మొదటి ప్రశ్న 'మీరు అతని గురించి ప్రార్థనచేశారా' అని. మందులు ఇవ్వడంకంటే ప్రార్థన చేయడం ముఖ్యమని వాళ్ళు భావిస్తారు. ఇది చాలామందికి విచిత్రంగా కనిపించవచ్చును. నిర్మల్‌హృదయ్‌ని ఆస్పత్రిగా మార్చడానికి, ఎప్పుడూ అందుబాటులో ఉండేట్లు ఒక డాక్టర్‌ను నియ మించడానికి కూడా ఆమె అంగీకరించనిది అందుకే. రోగులకు మందులు ఇవ్వకపోతేనేమి వారికి దేవుని ప్రేమను అందిస్తున్నారు. ఈ ప్రేమ ఏ మందుల్లోనూ ఉండదు. దేవుడే ఆ రోగుల సంగతి చూసుకుంటాడు. 'దేవుడు ఏది తలిస్తే అది జరుగుతుంది' అని థెరిసా భావిస్తుంది. (Paul Chetcuti, Society of Jesus, choosing to serve the poor, Irish Messenger press, 1992, జూ.11)

దేవుడు ఏది తలిస్తే అదే జరుగుతుందని ఆయన మీదనే భారం వేసే థెరిసా తన వైద్యం కోసం అమెరికా వెళ్ళడం, స్పెషలిస్ట్‌లను రప్పించడం ఎందుకో అర్థంకాదు. అలాగే నిరుపేదలు ఎక్కడైనా ఒక్కటే. కోల్‌కతా నిర్మల్‌హృదయ్‌లో మందులకు బదులు ప్రార్థనలతో సరిపెట్టిన థెరిసా యూరప్ దేశాల్లో, ముఖ్యంగా రోమ్‌లో అత్యాధునిక కేంద్రాలను ఎందుకు ఏర్పాటు చేసినట్టు? నిరాడంబరంగా పనిచేయాలనుకుంటే కోట్లాది డాలర్ల నిధులు కూడబెట్టడం ఎందుకు? సేవా కేంద్రాలలో కనీస సదుపాయాలు ఏర్పాటు చేసేందుకే ఇష్టపడని థెరిసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీని అంతర్జాతీయ సంస్థగా తీర్చిదిద్దడానికి ఎక్కడలేని శ్రమ తీసుకున్నారు. ఇస్లామిక్ దేశాల్లో కూడా సెంటర్లు తెరిచారు. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ అనే కాథలిక్

సామ్రాజ్యాన్ని విస్తరించేందుకు అన్నిరకాల మార్గాలు, పద్ధతుల్ని అనుసరించారు. ఆమె లక్ష్యం క్రైస్తవేతరదేశాల్లో దేవుని సందేశం వినిపించడంతప్ప రోగులు, బాధితులకు సేవచేయడం కాదు. అందుకనే మందుల కోసంపైసా ఖర్చుపెట్టడానికి కూడా ఇష్టపడేవారు కాదు. ఎవరైనా ఉచితంగా ఇవ్వాల్సిందే. అలా ఉచితంగా వచ్చినవాటిని కూడా పరిమితంగానే ఉపయోగించేవారు.

సేవ పేరుతో ఏమీ చేయకుండా ఎంతో చేస్తున్నట్లు ప్రచారం చేసుకోవడమేకాక విదేశాల నుంచి కోట్లాది డాలర్ల నిధులు కూడా దండుకునేవారు. ఆమె చేసే సేవలో పాలుపంచుకోవాలని వచ్చిన విదేశస్థులెందరో ఇక్కడకు వచ్చిన తరువాత అసలు సంగతి తెలుసుకుని తీవ్ర అసంతృప్తి చెందారు. అయితే సేవ పేరుతో పచ్చిమోసం జరుగుతోందని తెలిసినా క్రైస్తవులుగా అక్కడంతా దేవుని కార్యమే జరుగుతోందని నమ్మడమేకాక అలాగే ప్రచారం చేసేవారు.

డా.మేరీ పాప్లిన్ (Mary Poplin) కాలిఫోర్నియా క్లారామాంట్ విశ్వవిద్యాలయంలో ఎడ్యుకేషన్ ప్రొఫెసర్‌గా పనిచేస్తారు. ఆమె కూడా 1996లో కోల్‌కతాకు వచ్చి నిర్మల్‌హృదయ్‌ను చూసి అక్కడంతా అస్తవ్యస్తంగా, దారుణంగా ఉందని తెలుసుకున్నా, థెరిసా 'ప్రేమ' మార్గంలో ఇలాగే ఉంటుందని సరిపెట్టుకున్నారు. పైగా 'ప్రార్థన' ద్వారానే అద్భుతాలు జరుగు తున్నాయని, ప్రార్థన గొప్పదనాన్ని తెలునుకోవడం కష్టమని వ్యాసాలు రాసింది. ఎంతో తర్కబద్ధంగా,పద్ధతిగా ఆలోచించగలిగిన వ్యక్తి కూడా థెరిసా మాయలో పడిపోయింది. ఆమె చెపుతున్న ప్రార్థన ద్వారా సేవ నిజమే నని,మందులకంటే అదే గొప్పగా పనిచేస్తుందని నమ్మింది. క్రైస్తవ విలువలకు ఎంతో ప్రాధాన్యమిచ్చే అమెరికాలో పాప్లిన్‌వంటివారు ఎక్కువగా కనిపిస్తారు. వారి ఆలోచన, తర్కం మతవిషయానికి వచ్చేసరికి ఆవిరైపోతుంది. ఛారిటీ సంస్థలో థెరిసాతోపాటు సిస్టర్లంతా నిస్వార్థంగా, ఏ డబ్బు ఆశించకుండా కష్టపడుతున్నారని నమ్ముతారు. నిజానికి ఏమీ చేయ కుండానే థెరిసా అపారమైన పేరు, డబ్బు గడించారన్నది గ్రహించరు. అలా ఎప్పుడైనా తెలుసుకున్నా బయటకిమాత్రం చెప్పరు, చెప్పలేరు. అదే థెరిసా మాయ! క్రైస్తవ మీడియా మాయ! ఈ మాయలో పడినవారికి రోగులకు మందులు ఇవ్వకుండా క్రమంగా చంపేయడం, మొద్దుబారిపోయి వంకరలు తిరిగిన సూదులతోనే వారిని కుళ్ళబొడవడం వంటి అమానుష చర్యలు కనిపించకుండా పోతాయి. 'యేసు కోసం' అంటూ థెరిసా చేసినదంతా సేవగానే పరిగణించి,ఆమెనుగొప్ప మానవతావాదిని చేశారు, చేస్తున్నారు. ఒక్క నిర్మల్‌హృదయ్

మాత్రమేకాదు మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ఆధ్వర్యంలో నడిచే శిశుభవన్ (అనాథపిల్లల ఆశ్రమం) లో కూడా పరిస్థితులు దారుణంగానే ఉంటాయి. థెరిసా జీవిత చరిత్ర రాసిన ఇలీన్ ఈగన్ (Eileen Egan) ప్రకారం 1958లో శిశుభవన్‌లో 90మంది పిల్లలు ఉండేవారు. ఇప్పుడు అదే భవనంలో 300మందికి పైగా ఉన్నారు. పిల్లల సంఖ్య మూడురెట్లకు పైగా పెరిగినా నివాసం మాత్రం అదే. అందుకునే ఒక్కో మంచం మీద ఎనిమిది మంది పిల్లల్ని పడుకోబెడతారు. మంచానికి మంచానికి మధ్య దూరమే ఉండదు. పాలసీసాలు కొన్నే ఉంటాయి. వాటితోనే అందరికీ పాలుపడతారు. ఒకే ప్లేటు, చెంచాతో పిల్లలకు అన్నం పెడతారు. సరైన బాత్రూమ్‌లు, టాయ్‌లెట్‌లు లేవు. డ్రైనేజ్ పైపు మీద వేసిన చెక్క పై కూర్చుని పిల్లలు కాలకృత్యాలు తీర్చుకుంటారు. దీనివల్ల అనేక రకాల రోగాల బారిన పడుతున్నారు. ఆ డ్రైనేజ్ పక్కనే పిల్లల బట్టలు ఉతుకుతారు. నిర్మల్‌హృదయ్ గురించి చెప్పిన డాన్‌లీటన్ (Dan Leighton) శిశుభవన్‌లో కూడా కొద్దిరోజులు ఉన్నాడు.

దిగార్డియన్ పత్రికకు రాసిన ఒక లేఖలో శిశుభవన్‌లో పిల్లల దయనీయమైన పరిస్థితిని వర్ణించాడు. శిశుభవన్‌లో ఒక పిల్లవాడు కాలు నేలకు రాసుకుంటూ తిరగడం చూసి అతని కాలు విరిగిందని సిస్టర్స్‌కు చెప్పాడు. అతని మాటలు పట్టించుకోని సిస్టర్లు పిల్లవాడికి పోలియో అని సర్ది చెప్పారు. కానీ ఆ తరువాత వైద్య పరీక్షల్లో అతని కాలు విరిగిందని తేలింది. సకాలంలో వైద్యం చేయించకపోవడంవల్ల ఆ పిల్లాడు శాశ్వతంగా అవిటివాడిగా మారాడు. (Letters, 16, November, 1996)

బ్రిటిష్ ఎయిర్‌వేస్‌లో పనిచేసిన పీటర్ టేలర్ (Peter Taylor) థెరిసా హోమ్‌లలో చాలాకాలం వాలంటీర్‌గా పనిచేశాడు. ముఖ్యంగా శిశుభవన్‌లో పరిస్థితుల గురించి అతను మదర్ థెరిసా - టైమ్ ఫర్ ఛేంజ్ అనే డాక్యుమెంటరీ (Mother Teresa: Time for Change) లో వివరించాడు -

"నిజంగా సేవ చేస్తున్నామని చెప్పుకోవాలంటే మిషనరీస్ ఆఫ్ ఛారిటీ హోమ్‌లలో పరిస్థితులు చాలా మారాలి, మెరుగుపడాలి. ఇక్కడ (శిశుభవన్)లో పిల్లవాడి ముఖం ఒకపక్క పాలిపోయి ఉండడం చూశాను. ఎప్పుడూ కొట్టడంవల్ల అలా మారిందని నాకు తెలిసింది. అలాగే విన్సెంట్ అనే పిల్లవాడికి తీవ్ర ఇన్‌ఫెక్షన్ సోకిందని గుర్తించాను. మూత్రం, మలంతో నిండిన బట్టలు మార్చకుండా వదిలేయడంతో అలా జరిగింది. ఇదే విషయాన్ని సిస్టర్‌కు చెపితే 'మనమేం చేస్తాం. దేవుని ఇచ్ఛ అలా ఉంది' అని సమాధానమిచ్చింది. దేవుని ఇచ్ఛ అదికాదు, మీరు పిల్లవాడి

సంరక్షణ సరిగా చేయాలనేదేవుడు కోరుకుంటాడు, కానీ మీరు ఆ పని చేయడంలేదని సిస్టర్‌తో అన్నాను. విన్సెంట్ కొన్నిరోజులకే చనిపోయాడు."

అమెరికా అధ్యక్షహోదాలో బిల్‌క్లింటన్ ఢిల్లీ వచ్చినప్పుడు, క్లింటన్ దంపతులు థెరిసా నడుపుతున్న అనాథాశ్రమాన్ని సందర్శించారు. ఈ కార్యక్రమం గురించి రాసిన వాషింగ్టన్ పోస్ట్ అనాథాశ్రమంలో పిల్లలు మాత్రం కంపు కొడుతున్నా రని రిపోర్ట్ చేసింది. కోల్‌కతా ఆశ్రమాల మాదిరిగానే ఇక్కడా పిల్లల బట్టలు మార్చే పద్ధతి లేదని ఆ పత్రిక చెప్పకనే చెప్పింది. శిశుభవన్‌లో పిల్లలపట్ల సిస్టర్ల నిర్లక్ష్య ధోరణి, పిల్లల సంరక్షణకంటే ముప్పొద్దులా ప్రార్థనలకే పరిమితమయ్యే వింత ప్రవర్తన గురించి పీటర్ టేలర్ (Peter Taylor), ది గార్డియన్ (The Guardian) కు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పాడు. 24 గంటలు బెడ్‌పై పడుకుని ఉండ లేక పిల్లలు విసుగుతో సగం నీరసించిపోతున్నారు. కొందరు విపరీతమైన నొప్పులతో బాధ పడుతున్నారు. అయినా సిస్టర్లు మాత్రం అది 'దేవుని ఇచ్ఛ' అంటూ సరిపెడు తున్నారు. సిస్టర్లకు ప్రాథమికమైన విషయాలు కూడా తెలియవు. ఒకేవైపు ఎక్కువసేపు పడుకుని ఉంటే కురుపులు లేస్తాయి. అందుకనే రోగిని తరుచుగా అటుఇటు తిప్పుతూ ఉండాలి. సిస్టర్లు కనీసం ఈ పని కూడా చేయరు. పనికాదు ప్రార్థనే మన ప్రధాన వృత్తి అని థెరిసా సిస్టర్లతో చాలాసార్లు చెప్పగా విన్నాను. శిశుభవన్‌లో సిస్టర్లది అతిదారుణమైన నిర్లక్ష్యం, అతిక్రూరమైన దాడి. మందు వేస్తూ, లేదా బట్టలు మారుస్తూ ఎందుకు ప్రార్థన చేసుకోకూడదు? పిల్లల్ని అంత బాధలో వదిలిపెట్టి ప్రార్థన ఎలా చేయ గలుగుతారో!" (The Guardian, 14,October, 1996)

సకాలంలో వైద్యం చేయిస్తే చక్కగా తిరగగలిగిన ఎంతోమంది పిల్లలు సిస్టర్ల నిర్లక్ష్యం కారణంగా శాశ్వతంగా అంగవికలురుగా మారారు. మద్రాస్ సెంటర్‌కు ఎంఆర్ఎఫ్, అశోక్‌లేలాండ్ వంటి సంస్థలు ఆహారపదార్థాలు ఉచితంగా సమకూర్చినా అవి పిల్లలకు మాత్రం చేరేవి కావని సాలీ వార్నర్ (Sally Warner) అనే ఆస్ట్రేలియా వాలంటీర్ వివరించింది. గదులను చక్కగా తీర్చిదిద్దేందుకు బెర్జర్‌పెయింట్స్ కంపెనీ పెయింట్ డబ్బాలు ఇస్తే వాటిని చర్చ్ కోసం వాడారు. పిల్లలు ఉండే గదులతోపాటు వారిని కూడా దయనీయమైన స్థితిలో ఉంచితే చూడటానికి వచ్చిన విదేశ స్థులు మనసు కరిగి వెంటనే డొనేషన్లు ఇస్తారని భావించేవారు. పిల్లల కోసం మిక్కీమౌస్ లాంటి బొమ్మలు పోస్టర్లు కూడా గోడలకు అతికించడానికి వీలులేదు. కేవలం థెరిసా, జీసస్ పోస్టర్లు మాత్రమే పెట్టవచ్చును. కోల్‌కతా అనాథాశ్రమంలోనూ దారుణమైన పరిస్థితులే ఉన్నాయని వార్నర్ పేర్కొంది. 10మీటర్ల పొడవు, అంతే వెడల్పు ఉన్న

గదిలో నలభైమందికి పైగా పిల్లలు ఉన్నారు. వీరంతా అంగవైకల్యంతో బాధపడుతున్నవారే. పిల్లలకోసం ఒక ఆస్ట్రేలియన్ బహుకరించిన బొమ్మలు వెంటనే మాయమైపోయాయి. పక్కనే ఉన్న ఆటస్థలానికి కూడా ఎప్పుడూ తాళంవేసి ఉంచే వారు. ఇలా ఏ థెరిసా అనాథఆశ్రమమైనా పిల్లలకి తిండి, నీళ్ళు ఇవ్వకపోవడం, రోగానికి మందువేయకపోవడం,వారిని స్వేచ్ఛగా ఆడుకోనివ్వకపోవడం, వారి హీనదీన స్థితిని చూపించి నిధులు దండుకోవడం మామూలేనని వార్నర్ వివరించింది. పిల్లల స్థితి చూసి జాలివేసి ఇతర వాలంటీర్లతో కలిసి వార్నర్ అనేకసార్లు విజ్ఞాపన పత్రాలు సమర్పించింది కూడా. కానీ వాటన్నింటినీ చెత్తబుట్టలో పడేసిన సిస్టర్లు వార్నర్‌ను ఒకసారి బెదిరించారు కూడా. పిల్లల పేరు చెప్పి మిషనరీస్ ఆఫ్ ఛారిటీ డబ్బు దండుకుంటే ఆ పిల్లలకు ఉచితంగా తిండి, మందులు, బొమ్మలు ఇస్తున్నామంటూ కొన్ని కంపెనీలు ప్రచారం చేసుకున్నాయి. అలాంటి కంపెనీల్లో ఒకటి బెల్జియం దేశానికి చెందిన బెల్గోమిల్క్. ఇది చంటిపిల్లల పాలపౌడర్ తయారుచేసే కంపెనీ. ఇది మోనీడైన్ (Monidyne) అనే పాలపౌడర్ ఉత్పత్తి చేస్తుంది. కాథలిక్ మతానికి బాగా కట్టుబడే ఈ కంపెనీ మిషనరీస్ ఆఫ్ చారిటీ కోసం ప్రత్యేకంగా పౌడర్ పంపేది. కానీ మతలబు అంతా ఆ పంపిన పౌడర్‌లోనే ఉంది. సాధారణంగా పాలపౌడర్లలో కొవ్వు 22 నుంచి 23 శాతం ఉంటుంది. కానీ బెల్గో కంపెనీ పంపిన ప్రత్యేక పౌడర్ మోనీడైన్‌లో మాత్రం 7.25 శాతం మాత్రమే ఉంటుంది. ఇక ఇతర పౌడర్లలో కార్బోహై డ్రేట్ 23 శాతం(పూర్తిగా లాక్టోస్ మాత్రమే) ఉంటే మోనీడైన్‌లో కేవలం 9.6 శాతం మాత్రమే. పిండి (starch) 38 శాతం. విటమిన్ల విషయానికొస్తే సాధారణ పాలపౌడర్లలో 12కు పైగా విటమిన్లు ఉంటే మోనీడైన్‌లో ఫోలిక్‌యాసిడ్, విటమిన్ కె, బి12, సి, డి విటమిన్లు అసలే లేవు. ఇలాంటి అతినాసిరకమైన పాలపౌడరును ప్రత్యేకమైన ప్యాకెట్లలో పంపి బెల్గోమిల్క్ సేవ చేస్తున్నట్లు పేరు సంపాదిస్తే దాన్ని ఉచితంగా పొంది, పిల్లలకు ఎంతో పౌష్టికాహారం ఇచ్చేస్తు న్నట్లు మిషనరీస్ ఆఫ్ చారిటీ గొప్పలు చెప్పుకుంది. మొత్తానికి సరైన తిండిలేక మలమలమాడి, నీరసించిపోయినది మాత్రం అభంశుభం ఎరుగని పసిపిల్లలు. మిషనరీస్ ఆఫ్ చారిటీ అనాధాశ్రమాల్లో పిల్లలకి మోనీడైన్ పాలే పడతారు. లేకపోతే లాక్టోజన్ అనే మరో పౌడర్‌తో కలిపి మోనీడైన్ ఇస్తారు. ఇదీ మరింత ప్రమాదకరం. రెండు వేరువేరు పాల పౌడర్లు కలిపివాడితే పిల్లలకు అసలు జీర్ణం కాదు. దానివల్ల విరోచనాలవంటి సమస్య ఎదురవుతుంది. అయితే నాసిరకమైన మోనీడైన్‌పౌడర్‌లో ఎక్కువగాఉన్న పిండివల్ల నిజానికి విరోచనాల సమస్య రాకూడదు. కానీ శిశుభవన్‌లోని అపరిశు

భ్రమైన పరిస్థితులవల్ల పిల్లలు తరుచు విరోచనాలవ్యాదితో బాధపడేవారు. ఇదే నాసిరకం పాలపౌడర్‌ను విదేశాల్లో ఉపయోగించి ఉంటే అది అక్కడ పెద్ద చర్చకు దారితీసి, ఆ వ్యవహారం చివరికి కోర్ట్ దాకా వెళ్ళేది. కానీ థెరిసాకు 'భారతరత్న' ఇచ్చిన మన దేశంలో ఆమెను ప్రశ్నించేవారేరి?

మదర్‌థెరిసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సంస్థ ఆధ్వర్యంలో ఎన్ని సంరక్షణ కేంద్రాలు నడుస్తున్నాయి అనేది అప్పుడూ, ఇప్పుడూ మాయే. కొందరు 120 దేశాల్లో 700 సెంటర్లు అంటే ఛారిటీ సంస్థ అధికారిక లెక్క 567 సెంటర్లు అంటుంది. ఇంతకు ముందు మనం చూసినట్లు పపువా న్యూ గునియాలో మాదిరిగా వీటిలో చాలా సెంటర్లు పూర్తిగా సన్యాసుల మఠాలు. వాటిలో ఎలాంటి సేవా కార్యక్రమాలు జరగవు. కానీ ఈ విషయాన్ని ఏమాత్రం పట్టించుకోని జర్నలిస్ట్‌లు ఇక్కడ ఎంతో సేవ జరిగిపోతోందని ప్రచారం చేశారు.

1. కోల్‌కతా, 308 అప్పర్‌సర్క్యులర్ రోడ్‌లో ఉన్న సెంటర్ ఇలాంటిదే. 8 లక్షల డాలర్ల విలువైన ఈ విశాలమైన నివాసంలో పెద్ద ఉద్యానవనం ఉంది అయితే ఇది పూర్తిగా సన్యాసినుల (నన్స్) కోసం కేటాయించినది. ఎప్పుడూ తలుపులుబిగించుకుని సన్యాసినులు దైవ చింతనలో మునిగి ఉంటారు.

2. 90 పార్క్ స్ట్రీట్, కోల్‌కతా ఇక్కడ నొవైస్ సెంటర్ ఉంది. 1,80,000 డాలర్ల విలువైన నాలుగంతస్తుల భవనంలో సేవాకార్యక్రమాలేవీ జరగవు. నొవైస్‌లంటే నన్ లేక ప్రీస్ట్‌గా మారేందుకు శిక్షణ పొందే యువతీయువకులు.

3. చిన్‌సురా, కోల్‌కతా ఇది మరొక సన్యాసుల మఠం. నిజానికి ఈ ప్రాంతంలో పేదలు, కష్టాల్లో ఉన్నవారు ఎక్కువ. ఇక్కడ సేవా కేంద్రం చాలా అవసరం. కానీ 1,00,000 డాలర్ల విలువ చేసే ఈ మూడంతస్తుల భవనంలో ప్రార్థనలు, దైవ సమావేశాలు మాత్రమే జరుగుతాయి.

4. కోల్‌కతా తూర్పుబైపాస్‌లోని ఉదయన్ కొండువిల్లేలో బెంగాల్ ప్రభుత్వం రెండు ఫ్లాట్ (ఒక్కొక్కటి 50,000 డాలర్లు)లు ఇచ్చింది. ఇవి రెండూ నన్స్ నివాసాలుగా ఉపయోగిస్తున్నారు తప్ప అక్కడ ఎలాంటి సేవా కార్యక్రమాలు జరగవు.

ఇలాగే నేపాల్, లండన్, రోమ్, బెల్జియం, జర్మన, స్వీడన్, స్పెయిన్, మాల్టా, అమెరికా, కెనడా, ఐస్‌లాండ్ తదితర దేశాల్లో కూడా 150కి పైగా ఇలాంటి సన్యాసి మఠాలు ఉన్నాయి. ఇలా లక్షల డాలర్ల విలువ చేసే భవనాలను సన్యాసుల

మతంగా ఉపయోగిస్తున్న ఘనత మిషనరీస్ ఆఫ్ చారిటీకే దక్కుతుంది. ఈ సంస్థ సేవా కార్యక్రమాల కోసం ఎందరో దాతలు ఇచ్చిన నిధుల్లో ఎక్కువశాతం తమ సిస్టర్స్, బ్రదర్స్ మతశిక్షణ కోసం ఉపయోగిస్తుంది.

ఇలా సేవానిధిని మత కార్యకలాపాలకు ఉపయోగించిన థెరిసా పైకి మాత్రం మత భేదం లేకుండా అందరికీ సేవ అందిస్తున్నట్లు చెప్పుకున్నారు. కానీ కాస్త తరచి చూస్తే అందరికీ నచ్చుబాటు అయ్యేందుకు, ఇతర దేశాల్లో ఇబ్బందులు ఎదురుకాకుండా ఉండేందుకు మతానికే సేవ ముసుగువేశారని ఇట్టే అర్థమైపోతుంది. 1980లో భూటాన్ వెళ్లిన థెరిసా అక్కడ కుష్టురోగుల కేంద్రం ప్రారంభిస్తామని ప్రభుత్వాన్ని పర్మిషన్ అడిగారు. కానీ థెరిసా క్రైస్తవమత ప్రచార ధోరణి, మత ప్రచార పద్ధతులు తెలిసిన భూటాన్ ప్రభుత్వం అనుమతినివ్వలేదు. కుష్టురోగులపట్ల ప్రత్యేకమైన ఆదరం, శ్రద్ధ చూపే థెరిసా ప్రభుత్వానికి నచ్చచెప్పే ప్రయత్నం ఏమీ చేయలేదు. అక్కడ సెంటర్ ప్రారంభించాలన్న ఆలోచన విరమించుకున్నారు. కానీ ఆ తరువాత అక్కడే మతవిషయాల జోలికి వెళ్ళమని హామీ ఇచ్చిన మరొక క్రైస్తవ చారిటీ సంస్థకుష్టురోగుల కేంద్రం ప్రారంభించింది. థెరిసా మాత్రం ఆ హామీ ఇవ్వలేకపోయారు. శ్రీలంకలోని కొలంబోలో కూడా ఇదే జరిగింది. అక్కడ ప్రచారానికి పాల్పడుతున్నారని తీవ్రమైన ఆరోపణలు వచ్చిన నేపథ్యంలో థెరిసా తన సెంటర్ మూసుకోవాల్సివచ్చింది. వియత్నాంలో కూడా థెరిసా సెంటర్ మతచిచ్చు రేపింది. అక్కడ ఏకంగా రెండు క్రైస్తవవర్గాల(కాథలిక్, ప్రొటెస్టెంట్) మధ్య గొడవలకు కారణమైంది. దీంతో ప్రభుత్వమే థెరిసాను సాగనంపింది.

**ఇతర మతాల ప్రార్థనాస్థలాలు, దేవాలయాలపట్ల ప్రత్యేకమైన మక్కువ, ఆసక్తి (కోల్‌కతా కాళీదేవాలయం ఆవరణలోనే నిర్మల్‌హృదయ్) చూపిన థెరిసా నేపాల్‌లోని ప్రసిద్ధ పశుపతినాథ దేవాలయంలో కూడా పాగా వేశారు.** గుడి ఆవరణలో రెండు అతి ఇరుకైన గదుల్లో 25 మంది అనాథలతో ఒక సెంటర్ ప్రారంభించారు. ఆ గదులు ఎంత ఇరుకైనవంటే నిజానికి అవి గదులుకావు. రెండు సొరంగాలు అని చెప్పవచ్చును. వాటిలో నిటారుగా కూర్చునేందుకు కూడా వీలు ఉండదు. గాలి, వెలుతురు అసలే ఉండవు. విచిత్రమేమిటంటే ఈ సెంటర్‌కు ఒక మైలు దూరంలోనే చారిటీ సంస్థకు చెందిన మరొక అనాథాశ్రమం ఉంది. అది ఎంతో విశాలంగా, సౌకర్యంగా ఉంటుంది. అయినా పశుపతినాథ మందిరంలోని సెంటర్‌ను అక్కడకి మార్చేందుకు థెరిసా ఒప్పుకోలేదు. అందుకు కారణం ప్రముఖ హిందూ

దేవాలయంలో అడుగు పెట్టానని చెప్పుకోవడం ముఖ్యమని థెరిసా భావించారు. **హిందూదేవాలయంలో క్రైస్తవ పాగా వేయగలిగాననే గర్వాన్ని పొందడం ఆమెకు ముఖ్యం. అందుకు పేదలు, బాధితులను పావులుగా వాడుకునేందుకు కూడా థెరిసా వెనుకాడలేదు.** అదీ ఆమె క్రైస్తవ నిష్ఠ! చుట్టూ దుకాణాలతో ఇరుకుగా తయారైన కోల్‌కతా నిర్మల్‌హృదయ్ (కాళీఘాట్) సెంటర్‌ను మరొక విశాలమైన భవంతిలోకి మార్చేందుకు ప్రభుత్వమే ముందుకు వచ్చినా అందుకు ఒప్పుకోకపోవడానికి కూడా కారణం ఈ దురాక్రమణ స్వభావమే.

వీధిబాలల సంక్షేమం కోసం కృషి చేసిన పీటర్ డాల్‌గ్లిష్ (Peter Dalglish) ఒకసారి మదర్‌థెరిసాను కలిశారు.

వీధి పిల్లలకు చదువు చెప్పించి వారిని ప్రయోజకులుగా ఎలా తీర్చిదిద్దుతున్నదీ వివరించారు. అంతా విన్నతరువాత థెరిసా అడిగిన ప్రశ్న ఏమిటంటే - "మీరు వాళ్ళకి బైబిల్ చదవడం నేర్పరా" అని (The Courage of Children,p.289). అదీ థెరిసా సేవ వెనుక ఉన్న మత దృష్టి.

**మిషనరీస్ ఆఫ్ చారిటీ సెంటర్లలో కనీస సదుపాయాలు కూడా కనిపించకపోవడంపై థెరిసా విచిత్రమైన వాదన విని పించేవారు. ' మా సెంటర్లలో రోగుల కోసం సర్జికల్ స్పిరిట్ లేకపోవచ్చును. కానీ మా దగ్గర డివైన్ స్పిరిట్ (దేవుని అనుగ్రహం)ఉంది. బ్యాండేజ్‌లు (కట్లు) లేకపోవచ్చును. కానీ మా దగ్గర ప్రేమ బంధం ఉంది.'** నిజానికి ఆ సెంటర్లలో రోగులు, బాధితులకు థెరిసా అందించిన ప్రేమ ఎలాంటిది? -

- చావు మంచంలో కొనఊపిరితో కొట్టుకుంటున్న అభాగ్యుడి చేతిని కనీసం తన చేతిలోకి తీసుకోకపోవడం.
- క్యాన్సర్‌వంటి ప్రాణాంతక వ్యాధులవల్ల విపరీతమైన నెప్పితో బాధపడుతున్న వారికి పెయిన్‌కిల్లర్ మాత్రలు కూడా ఇవ్వకపోవడం.
- మత విశ్వాసాలను పట్టించుకోకుండా మహిళా రోగులకు కూడా జుట్టు తొలగించడం.
- ఒకే సీసాతో చాలామంది పిల్లలకి పాలుపట్టడం.
- ఎనిమిదిమంది పిల్లలకి ఒకే మంచం కేటాయించడం.
- ఎందుకూ పనికిరాని, ఉచితంగా వచ్చిన పాలపౌడర్‌నే 'పౌష్టికాహారం'గా పిల్లలకు పట్టడం.
- మొుండిబారిపోయిన, వంకరటింకర సూదులతో రోగుల్ని పదేపదే కుళ్ళబొడవడం.
- మాటవినని రోగుల్ని తన్నడం!



# పాపపు సొమ్ముతో 'పుణ్య'కార్యాలు

రోగులు, దీనుల సేవ చేస్తున్నామని ప్రపంచవ్యాప్తంగా ప్రచారం చేసుకుని నిధులు దండుకున్న థెరిసా నిజానికి ఒక్క పైసా కూడా అందుకు వినియోగించలేదు. పైగా తాను పోగేసిన నిధుల్ని ఎప్పటికప్పుడు వాటికన్‌కు తరలించేవారు. ఎన్ని నిధులు కూడగట్టినదీ, ఎంత ఖర్చు పెట్టినదీ ఏనాడూ లెక్క చూపించలేదు. అత్యంత కఠిన నిబంధనలు ఉండే బ్రిటన్‌లో తప్ప మరే దేశంలోనూ ఆమెను ఏ ప్రభుత్వమూ పద్దులు అడిగిన పాపాన పోలేదు. తాను చేసేది దైవకార్యంకనుక ఎవరికీ లెక్కలు చెప్పాల్సిన అవసరం లేదనే ధోరణిలోనే ఉండేవారు. 'ఏదైనా కార్యం తలపెడితే దేవుడే అందు కు అవసరమైన డబ్బు కూడా ఏర్పాటు చేస్తాడు' అని ఆమె గొప్పగా చెప్పుకునేవారు. మన దేశంలో స్వచ్ఛంద సంస్థలు జమాఖర్చుల వివరాలు వెల్లడించాలన్న నిబంధన ఏదీ లేకపోయినా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ తప్ప అన్ని సంస్థలు ఆ పని చేస్తాయి. కోట్ల డాలర్ల నిధులు కూడబెట్టిన థెరిసా వాటి లెక్కల్ని ఎప్పటికప్పుడు ప్రభుత్వానికి తెలియజేస్తున్నట్లు ప్రచారం మాత్రం చేసేవారు - 'ప్రతి నెల మేం ఒక్క బియ్యం కొనడానికే లక్ష రూపాయలు ఖర్చు చేస్తాం. ఈ డబ్బంతా చిన్నచిన్న విరాళాల ద్వారానే వస్తుంది. ముఖ్యమైన విషయం ఏమిటంటే ఈ విరాళాలు హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు... ఇలా అందరూ ఇస్తారు. ఖర్చుల వివరాలను ఎప్పటికప్పుడు ప్రభుత్వానికి తెలియజేస్తాం. ఎందుకంటే మాకు దాచుకోవాల్సిన రహస్యాలేమీ లేవు' (హలో పత్రిక, 1,అక్టోబరు, 1994). ఇంతకీ థెరిసా చేసిన సేవకు 'ముగ్ధులై' నిధులు సమర్పించినది సాధారణ ప్రజానీకం కానేకాదు. ప్రజల్ని పీల్చిపిప్పిచేసి సొమ్ము కూడబెట్టిన నియంతలు, సామాన్యుల కష్టార్జితాన్ని దిగమింగిన బడా వ్యాపారులు, అక్రమార్కులు. ఇలాంటి పాపపు సొమ్ము కూడబెట్టినా అది ఎవరు, ఎప్పుడు ఇచ్చారో, ఆ ఇచ్చినవారి ఘన చరిత్ర ఏమిటో మాత్రం థెరిసా బయట పెట్టేవారు కాదు. దేవుడే అంతా సమకూరుస్తున్నాడంటూ దాటవేసేవారు. అంతర్జాతీయ సేవస్వరూపిణిగా పేరుపడిన థెరిసాను ఇంత సొమ్ము ఏ దేవుడు పంపుతున్నాడని నిలదీసే ధైర్యం ఎవరికి ఉంటుంది? ఆ సంగతి ఆమెకు బాగా తెలుసు. అందుకనే యథేచ్ఛగా నిధులు కూడబెట్టడంతోపాటు నోటికి వచ్చిన అబద్ధాలు చెప్పేవారు. స్వచ్ఛంద సంస్థలకు విదేశాల నుంచి నిధులు వస్తే ఆ వివరాలను తప్పకుండా కేంద్ర హోంమంత్రిత్వశాఖకు అందించాలన్న

నిబంధన ఉంది. మిషనరీస్ ఆఫ్ చారిటీకి విదేశాల నుంచి అందిన నిధుల వివరాలు ఇలా ఉన్నాయి -

1998-99లో విదేశాల నుంచి 29కోట్ల 20 లక్షల రూపాయలు, 1997-98లో 17కోట్ల 30 లక్షలు, 1996-97లో 14కోట్ల80 లక్షల రూపాయల నిధులు వచ్చాయని తెలుస్తోంది. కానీ సంస్థ లావాదేవీలన్నీ వాటికన్ బ్యాంక్ (ఇనిస్టిట్యూట్ ఆఫ్‌రిలిజియస్ వర్క్స్) ద్వారా జరగడంతో అసలు లెక్కలు, ఆర్థికకార్యకలాపాలు రహస్యంగానే ఉండిపోయాయి. 1981-82లో వాటికన్ బ్యాంకులో భారీ కుంభకోణం బయటపడడంతో దానితోపాటు మిషనరీస్ ఆఫ్ ఛారిటీ బండారం కూడా వెల్లడైంది. విదేశీమారక ద్రవ్య కుంభకోణంలో మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ఉందని ఇటలీ అధికారులు అనుమానించారు. 12, మే, 1981న వాటికన్‌కు చెందిన ఒక ఉన్నతాధికారి భార్యను పోలీసులు అరెస్ట్ చేశారు. నవంబర్, 1981లో ఈ కేసు విషయమై ఛారిటీస్ కార్యకలాపాలను కూడా పరిశీలిస్తున్నట్లు ఇటలీ అధికారులు థెరిసాకి తెలియజేశారు. కానీ ఆ తరువాతే కేసు పక్కదారిపట్టింది. థెరిసా వంటి అంతర్జాతీయ వ్యక్తిపై బురద జల్లుతున్నారంటూ మీడియాలో నిరసనలు వ్యక్తం కావడంతో ఇటలీ అధికారులు విచారణను పక్కనపెట్టకతప్పలేదు.

వాటికన్ బ్యాంకు విదేశీ కరెన్సీ కుంభకోణం (మనీ లాండరింగ్) బయటపడ్డ ఏడాదికి మిలన్‌కు చెందిన బాంకో ఆంబ్రోసియానో (Banco Ambrosiano) (ఈ బ్యాంకులో కూడా ఛారిటీ అకౌంట్‌లు ఉన్నాయి)

అధ్యక్షుడు రాబర్టో కాల్వీ (Roberto Calvi) ఆత్మహత్య చేసుకున్నాడు.

కాథలిక్ వర్గాల్లో 'దేవుని బ్యాంకర్'గా పేరుపడిన రాబర్టో కాల్వీకి వాటికన్‌తో దగ్గరి సంబంధాలు ఉండేవి. కాల్వీది ఆత్మ హత్యకాదని, అతన్ని హత్య చేశారని కుటుంబసభ్యులు అనుమానించినా పోలీసులు మాత్రం అది ఆత్మహత్యేనని తేల్చారు. కానీ 15 ఏళ్ళ తరువాత తిరిగి విచారణ జరిపిన లండన్ పోలీసులు అది హత్యేనని నిర్ధారించారు. హత్యకు గురికావడానికి ముందు కరెన్సీ అక్రమాలలో పట్టుబట్ట కాల్వీకి 12మిలియన్ డాలర్ల జరిమానాతోపాటు నాలుగేళ్ళ జైలు శిక్షపడింది.

అలాంటి నేరస్థుడికే వాటికన్ బ్యాంకు ఎంతో గౌరవమిచ్చి, ఆదరించింది. బ్రిటిష్ కాథలిక్ వారపత్రిక 'ది యూనివర్స్' ప్రకారం కాల్వీకి చెందిన బాంకో ఆంబ్రోసియానోలో వాటికన్ బ్యాంక్ భారీ పెట్టుబడులు పెట్టింది. మనీ లాండరింగ్ పద్ధతులతోపాటు వాటికన్, మాఫియా లింకుల గురించి కాల్వీకి చాలా తెలుసని,

అందుకనే అతన్ని మట్టుపెట్టామని మాఫియా నాయకులు చెప్పినట్లు పత్రిక బయటపెట్టింది. (The Universe, 20,February, 1998) ఈ వ్యవహారం బయటపడిన తరువాత అనేక కాథలిక్ సేవా సంస్థలు వాటికన్ బ్యాంకులో తమ ఖాతాలు మూసేశాయి. మిషనరీస్ ఆఫ్ ఛారిటీ మాత్రం ఆ పని చేయలేదు. నిజానికి ఛారిటీ అకౌంట్లు ఆ బ్యాంకులో తప్ప మరే బ్యాంకులోనూ లేవు.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీ మాత్రమేకాదు అనేక కాథలిక్ సేవా సంస్థలకు మాఫియా ముఠాలు, ఆయుధ స్మగ్లర్లతో సంబంధాలు ఉన్నాయని తేలింది. బ్రిటన్‌కు చెందిన కాథలిక్ టైమ్స్ (Catholic Times) అనే వారపత్రిక ఆయుధ స్మగ్లింగ్ ముఠాలతో సంబంధ కలిగిన సంస్థలు, డయోసెస్ (dioceses)ల జాబితా ఒకటి ప్రచురించింది. ఇందులో సిస్టర్స్ ఆఫ్ సెయింట్‌పాల్, కాథలిక్ ఫారెన్ మిషన్స్, సిస్టర్స్ ఆఫ్ ఛారిటీ, సెయింట్ పాట్రిక్ మిషనరీ సొసైటీ మొదలైనవి ఉన్నాయి (కాథలిక్ టైమ్స్, 18, మే, 1997). విచిత్రమేమిటంటే ఇన్ని సంస్థల అక్రమ కార్యకలాపాలను బయటపెట్టిన కాథలిక్ టైమ్స్ ఏనాడూ మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి మాఫియా ముఠాలు, నిరంకుశ పాలకులు, ఆర్థికనేరస్థుల నుంచి అందిన నిధుల గురించి ప్రశ్నించలేదు.

హైతీ నిరంకుశపాలకుడు దువలియర్ (Duvalier), అతని భార్య నుంచి థెరిసా స్వయంగా విరాళాలు స్వీకరించారు. అంతేకాదు దువలియర్ నిరంకుశ, అరాచక పాలనను సమర్థిస్తూ ప్రకటనలు కూడా చేశారు. 'సామాన్య, పేద ప్రజానీకానికి గౌరవ నీయ అధ్యక్షుడు (దువలియర్), ఆయన భార్య చేసినంత సేవ నేను మరెక్కడా చూడలేదు. అందుకనే వారంటే ప్రజలకి ఎంతో అభిమానం ' అంటూ ప్రశంసలు కురిపించారు. (The Missionary position, Christopher Hitchens, verso, 1995, p.4)

ఇంతటి ప్రజాసేవ చేసేస్తున్నారంటూ థెరిసా ప్రశంసలు అందుకున్న దువలియర్ దంపతుల్ని ప్రజలు మాత్రం దేశం నుంచి తరిమికొట్టారు. తమను పీల్చిపిప్పిచేసి కూడబెట్టిన సంపదను స్వాధీనం చేసుకున్నారు.

మదర్ థెరిసాకు నిధులు అందించిన మరో ఘనుడు అమెరికాకు చెందిన ఛార్లెస్ కీటింగ్ (Charles Keating). సామాన్య ప్రజలు పొదుపుచేసుకున్న సొమ్మును స్వాహా చేసిన ఈ బడా మోసగాడి నుంచి థెరిసా భారీ విరాళమే పుచ్చుకున్నారు. 25కోట్ల 30 లక్షల డాలర్ల ప్రజాసొత్తును మింగేసినందుకు కీటింగ్‌పై విచారణ సాగింది. చివరికి అతను కటకటాలపాలయ్యాడు కూడా. కానీ తన

దొంగసొమ్ములో నుంచే కీటింగ్ ఒక కోటి ఇరవైఐదు లక్షల డాలర్లనుథెరిసాకు విరాళంగా ఇచ్చాడు. పైగా తన ప్రైవేటు విమానాన్ని అవసరమైనప్పుడు వాడుకునేందుకు ఉచితంగా ఇచ్చాడు. కీటింగ్ ఇచ్చిన విరాళాలకు ప్రతిఫలంగా థెరిసా అతనికి శిలువను బహూకరించారు. ఎక్కడకు వెళ్లినా కీటింగ్ ఆ శిలువను మెడలో వేసుకుని వెళ్ళేవాడు. ఆ విధంగా దేవుని సేవకుడు, దాత అని సమాజంలో గౌరవప్రతిష్టలు పొందాడు. అయితే కీటింగ్ ప్రజల సొమ్మును స్వాహా చేశాడని తెలియక థెరిసా అతని విరాళాన్ని స్వీకరించారనుకుంటే పొరపాటే. **చీటింగ్** కేసు **విచారణ జరుగుతున్నప్పుడు థెరిసా స్వయంగా న్యాయమూర్తికి ఉత్తరం రాశారు. అందులో కీటింగ్‌ను క్షమించేయాలని, తప్పులు అందరూ చేస్తారని** సలహా **ఇచ్చారు**. న్యాయమూర్తి లాన్స్ ఇటో (Lance Ito) కి థెరిసా రాసిన ఉత్తరం ఇలా ఉంది -

"ప్రియమైన, గౌరవనీయులైన లాన్స్ఇటో,

నాకు కీటింగ్ వృత్తివ్యాపారాలు, ఆర్థికలావాదేవీల గురించి ఏమీ తెలియదు. కానీ ఒకటి మాత్రం నిజం. ఆయన దేవుని పేదలపట్ల ఎప్పుడూ సానుభూతి చూపేవారు. వారికి సహాయం చేసేందుకు ఎప్పుడూ ముందుకు వచ్చేవారు. కీటింగ్‌పైఆరోపణల గురించి ప్రస్తావించేవారికి ఒక్కటే చెపుతాను. 'మీ హృదయంలోకి చూసుకుని, ఇలాంటి పరిస్థితులు ఎదురైతే జీసస్ ఏమి చేస్తారో అదే చేయండి' అని సూచిస్తాను. ఇప్పుడు మీకూ అదే విజ్ఞప్తి చేస్తున్నాను.

మీ కోసం, మీ కుటుంబం కోసం దేవుని ప్రార్థిస్తాను."

మదర్ థెరిసా (The Missionary position, Christopher Hitchens, verso, 1995, p.67)

కేసు విచారణ పూర్తి అయి, కీటింగ్‌కు జైలు శిక్షపడిన తరువాత లాస్ఏంజెల్స్ జిల్లా ఉపన్యాయమూర్తి పాల్ డబ్ల్యూ టర్లే (Paul W Turley) థెరిసాకు ఉత్తరం రాశారు.

"ప్రియమైన మదర్ థెరిసా, కీటింగ్ చేసిన మోసంవల్ల అనేకమంది మోసపోయారు. వారిలో రోజుగడవడం కూడా కష్టమైన వాళ్లు ఉన్నారు. మీ సంస్థ 'నా అతిసాధారణ, బలహీన సోదరులకు నువ్వు ఏం (ఏ అపకారం) చేసినా అది నాకు చేసినట్లే' అనే బైబిల్ సూక్తిని ఎక్కువగా ప్రచారం చేస్తూ ఉంటుంది. **కీటింగ్ ఇలాంటి అతిసాధారణ, పేద ప్రజల సొమ్మును కాజేశాడు.** ఇలాంటి నేరస్థుడిని ఏ చర్చ్, సేవా సంస్థ సమర్థించకూడదు. హృదయంలోకి చూసుకుని, జీసస్ ఏం చేస్తారో అదే చేయమంటూ మీరు న్యాయమూర్తి ఇటోకి సలహా ఇచ్చారు. కానీ నేను మీకు అదే సలహా ఇవ్వదలుచుకున్నాను. అలాంటి పాపపు సొత్తు తనకు

చేరితే జీసస్ ఏం చేస్తారో, అలాంటి దొంగ సొమ్ము ఇవ్వాలని చూస్తే ఎలా ప్రతిస్పందిస్తారో ఊహించండి. అలా ప్రవర్తించడానికి ప్రయత్నించండి. అలాంటి దొంగ సొత్తు తనకు చేరితే జీసస్ ఒక్కక్షణం ఆలోచించకుండా న్యాయపరంగా అది ఎవరి చెందుతుందో వారికి తిరిగి ఇచ్చేసేవారు. ఇప్పుడు మీరూ అదే చేయాలి. **మోసపూరితంగా సంపాదించిన సొత్తును కీటింగ్ మీకు ఇచ్చాడు. ఆ పాపపు సొమ్మును మీ దగ్గర ఉంచుకోకండి. అది ఎవరి కష్టార్జితమో వారికి ఇచ్చేయండి.** నన్ను సంప్రదిస్తే ఆ సొమ్ము ఎవరిదో చెపుతాను. వారి పేర్లు ఇస్తాను."

పాల్ డబ్ల్యూ టర్లీ (The Missionary position, Christopher Hitchens, verso, 1995, p.67)

ఒక నేరస్థుడిని రక్షించడానికి మదర్ థెరిసా ఏకంగా జీసస్‌నే అడ్డువేయాలను కున్నారు. కానీ అది సాధ్యం కాలేదు. కానీ **టర్లీకి మాత్రం ఆమె సమాధానం ఇవ్వలేదు. అలాగే కీటింగ్ నుంచి తీసుకున్న చీటింగ్ డబ్బు కూడా తిరిగి ఇవ్వలేదు.** విచిత్రమేమిటంటే ఎన్నికల విరాళాలకింద ఎవరెవరి నుంచో డబ్బు తీసుకునే హిల్లరీ క్లింటన్ వంటి రాజకీయ నాయకురాలు కూడా మాదకద్రవ్య వ్యాపారి నుంచి తీసుకున్న 22,000 డాలర్ల సొమ్మును తిరిగి ఇచ్చేశారు.

మదర్ థెరిసాకి విరాళాలు ఇవ్వడం ద్వారా పేరుప్రతిష్టలు సంపాదించుకోవాలని చాలామంది మోసగాళ్లు, అక్రమార్కులు ప్రయత్నించారు. అలాంటివారి జాబితా చాలా పెద్దగానే ఉంటుంది. అమెరికా విచారణ సంస్థ ఎఫ్‌బిఐ, రష్యా గూఢ చారి సంస్థ కెజిబిలకు పనిచేసిన రాబర్ట్ హాన్‌సన్ ఇలాంటివాడే. డబుల్ ఏజెంట్ (ఏకకాలంలో రెండు ప్రత్యర్థి దేశాలకు గూఢచారి ఏజెంట్‌గా పనిచేయడం)గా పనిచేసిన రాబర్ట్ హాన్‌సన్ కెజిబి ఇచ్చిన కోటిడాలర్ల జీతంలో చాలావరకు థెరిసా సంస్థకు విరాళంగా ఇచ్చాడు. నిష్టాపరుడైన కాథలిక్‌గా ఫాదర్ రాబర్ట్ బుసియరెలీ (Robert Bucciarelli) సూచన మేరకు తానీ విరాళం ఇచ్చానని రాబర్ట్ గొప్పగా చెప్పుకున్నాడు. మదర్ థెరిసావంటి సజీవ సెయింట్‌కు డబ్బు విరాళంగా ఇవ్వడంలో తప్పేమీలేదంటూ సమర్థించేవాళ్ళు ఆ డబ్బు ఎలా వచ్చిందో, ఎంతమంది కడుపుకొట్టి కూడబెట్టినదనే విషయం మాత్రం ప్రస్తావించరు, పట్టించుకోరు. అదే మదర్ థెరిసా మాయ! క్రైస్తవ మీడియా మాయ!

ఎంతోమంది ఇచ్చిన వేల, లక్షల, కోట్ల డాలర్ల విరాళాలన్నీ ఏమైపో యినట్లు? అవన్నీ ఉపయోగించిఉంటే కోల్‌కతాలోనే కాదు ప్రపంచం మొత్తంలో ఎంతోమంది బాధితులు, రోగపీడితులకు మేలు జరిగి ఉండాలి. కానీ అలాంటి

దాఖలాలు ఏమీ లేవు. 1979లో నోబెల్ బహుమతి స్వీకరించడానికి ముందు సుదేబ్‌రాయ్ చౌదరి అనే జర్నలిస్ట్‌కు ఇచ్చిన ఇంట ర్వ్యూలో థెరిసా 'నోబెల్ బహుమతి కింద వచ్చే డబ్బును కుష్టురోగులు, అనాథలైన పేదల సంక్షేమం కోసమే ఉపయోగిస్తాను' అని గొప్పగా చెప్పారు. నోబెల్ బహుమతి కోటి పది లక్షల డాలర్లతోపాటు, కుప్పలుతెప్పలుగా పచ్చిపడిన ఇతర విరాళాలతో మొత్తం కోటి అరవై లక్షల డాలర్ల సొత్తు మూటగట్టుకున్న థెరిసా అదంతా కోల్‌కతాకు తెచ్చానని చెప్పారు. కానీ 1979 నుంచి థెరిసా చనిపోయేవరకు మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ఒకేఒక్క కొత్త సెంటర్‌ను ప్రారంభించింది. తంగ్రా ప్రాంతంలో ప్రారంభించిన ఆ ఒక్క సెంటర్‌కు భవనాన్ని స్థానిక హిందూ వ్యాపారి బిమల్‌జైన్ సమకూర్చారు. సెంటర్ లోనీటిని పంప్ చేసే మోటారుతో సహా సకల సౌకర్యాలకు మరో వ్యాపారి నవీన్ ఖిలానీ విరాళం ఇచ్చారు. ఇక భవనం కట్టిన స్థలాన్ని బెంగాల్ ప్రభుత్వం అద్దె లేకుండా ఉచితంగా లీజ్‌కు ఇచ్చింది. మరి నోబెల్ బహుమతి సొత్తు ఏమై నట్లు?

జూన్, 1981లో మదర్‌థెరిసాకు మిల్‌వాకీ మార్క్వెట్ విశ్వవిద్యాలయపు డిస్కవరీ మెడల్ లభించింది. బహుమతి మొత్తంగా 1,50,000 డాలర్లు వచ్చాయి. ఇందులో ఒక్క సెంట్ కూడా కోల్‌కతాకు చేరలేదు. ఆ తరువాత ఏడాది కెనడా టోరంటోలో స్థిరనివాసమేర్పరచుకున్న ఒక కోల్‌కతా మహిళ తన 1,65,000 డాలర్ల ఆస్తిని మిషనరీస్ ఆఫ్ చారిటీకి రాసిచ్చేసింది. అదంతా ఏమయిపోయిందో ఎవరికీ తెలియదు. అదే ఏడాది కెనడా ప్రజానీకం 9,25,000డాలర్లవిరాళాలు సేకరించి థెరిసాకు సమర్పించారు. ఆ సొమ్ములో ఎంత ఇక్కడికి వచ్చిందో తెలియదు. 1990లో కోల్‌కతాను సందర్శించినప్పుడు పాలస్తీనా లిబరేషన్ ఫ్రంట్ నేత యాసర్ అరాఫత్ 50,000 డాలర్లు విరాళం ఇచ్చారు. దాని సంగతీ ఎవరికీ తెలియదు.

విదేశీ పర్యటనల్లో థెరిసాకు వచ్చిన కోట్లాది డాలర్ల విరాళాల్లో ఒక్క సెంట్ కూడా భారత్‌కు చేరలేదు. కానీ విరాళాలు ఇచ్చినవారు మాత్రం తాము ఇచ్చిన సొమ్ము భారత్‌లో సేవా కార్యక్రమాల కోసం ఉపయోగపడుతోందని అనుకునేవారు.

మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి (చాటుమాటుగా) దత్తత శుల్కం ద్వారా పెద్దమొత్తంలో డబ్బు సమకూరుతుంది. పిల్లల్ని విదేశాలకు తరలించి అక్కడ కావలసిన వారికి దత్తతనివ్వడానికి చారిటీ ఫీజు వసూలు చేస్తుంది. 1960 నుంచి 70 దశకంవరకూ ఈ పద్ధతిలో సంస్థ కోట్లాది రూపాయలు వసూలు చేసింది. లండన్‌లోని చారిటీ సంస్థ కోసం విరాళాలు సేకరించే మదర్‌థెరిసా కమిటీ చూపిన లెక్కల ప్రకారం ఒక్క 1967లోనే దత్తత ఫీజు కింద 1444 పౌండ్లు (1,15,520

రూపాయలు) వసూలు చేశారు. 1970 తరువాత దత్తత విషయంలో భారత ప్రభుత్వం చట్టనిబంధనలు కఠినతరం చేయడంతో ఈ ఫీజు వసూళ్ళు తగ్గినా దత్తత తీసుకున్నవారు ఉదారంగా సమర్పించుకునే విరాళాలు మాత్రం అందు తూనే ఉన్నాయి. ఇలా పిల్లల వ్యాపారం (ఒకప్పుడు క్రైస్తవ దేశాలన్నింటిలో బానిస వ్యాపారం జోరుగా సాగేది. అది పోయిన తరువాత ఈ దత్తత వ్యాపారం మొదలైంది. కొన్నేళ్లక్రితం దత్తత వ్యాపారంపై పెద్దఎత్తున విమర్శలు, ఆరోపణలు రావడంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విచారణ జరిపించింది. ఈ వ్యాపారంలో ఉన్నది ఎక్కువగా క్రైస్తవ సంస్థలేనని అందులో తేలింది కూడా) ద్వారా థెరిసా సంస్థ బాగానే సొమ్ము వెనకేసుకోగలిగింది.

1990లో మదర్ థెరిసా కమిటీ లెక్కల ప్రకారం ఇంగ్లండ్‌లో సేకరించిన 2.9 మిలియన్ పౌండ్ల విరాళాల్లో లక్షపౌండ్లు మాత్రం కోల్‌కతా, రోమ్, మొజాంబిక్, హాలండ్, బెల్జియం దేశాలకు కేటాయించారు. ఈ కాస్త మొత్తంలో కోల్‌కతాకు ఎంత వచ్చిందన్నది ప్రశ్నార్థకమే. ఇక ఆ తరువాత ఏడాది విరాళాల మొత్తం 56 శాతం పెరిగితే కేటాయింపు మాత్రం 84 శాతం తగ్గిపోయింది! అంటే లక్ష పౌండ్ల నుంచి 20వేల పౌండ్లకు తగ్గిపోయిందన్నమాట.

1971లో కోల్‌కతాలోని నిర్మల్‌హృదయ్‌కి కేవలం 500పౌండ్లు కేటాయిస్తే, నన్స్, బ్రదర్స్ విమాన ఖర్చులకు 1,370 పౌండ్లు ఖర్చుపెట్టారు.

**1974లో ఇంగ్లండ్‌లో ఛారిటీ సంస్థ 1,17,394 పౌండ్లు విరాళాలుగా పొందితే అందులో 68 శాతం అంటే 80,000 పౌండ్లు రోమ్ (వాటికన్)కు** పంపారు. మరో **650 పౌండ్లు రోమ్‌లోని** మతశిక్షణ కళాశాలకు **కేటాయించారు. ఇక భారత్ లో పిల్లల సంరక్షణకు 334 పౌండ్లు, కోల్‌కతాలోని నిర్మల్‌హృదయ్‌కి 45 పౌండ్లు ఇచ్చారు. భారత్‌లో పేదల కోసం సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నామంటూ విరాళాలు సేకరించిన ఛారిటీ సంస్థ అందులో ఎక్కువ భాగం రోమ్‌కు తరలించేది.** మిగిలిన సొమ్ములో కొద్దిగా కోల్‌కతాకు కేటాయించేది. ఇలా సేవ ముసుగులో మతకార్యకలాపాలు విస్తరించడానికి భారతదేశాన్ని, ఇక్కడి పేదరికాన్ని భూతద్దంలో చూపి అప్రతిష్టపాలు చేసింది.

1975లో మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సిల్వర్ జూబ్లీ సంవత్సరం సందర్భంగా ఇంగ్లండ్‌లో 1,48,388 పౌండ్ల విరాళాలు పోగయ్యాయి. ఇందులో 114 శాతం అంటే 1,70,000 పౌండ్లు రోమ్‌కు పంపారు. అంటే ఆ ఏడాది వసూలైన విరాళాలు కాక అంతకు ముందు వచ్చిన సొమ్మును కూడా హెడ్‌క్వార్టర్స్‌కు తరలించారు. ఇక నిర్మల్‌హృదయ్‌కి 238పౌండ్లు కేటాయిస్తే, సిస్టర్స్‌కు (మత)శిక్షణ కోసం 2000

పౌండ్లు కేటాయించారు. ప్రపంచవ్యాప్తంగా పిల్లల సంరక్షణ కోసం 4000 పౌండ్లు పక్కకు పెట్టారు. అయితే మతశిక్షణ, పిల్లల సంరక్షణ నిధిని కూడా రోమ్‌కు పంపారు. ఇంతకీ మహిళలు, పిల్లలు లేని వాటికన్‌కు పిల్లల సంరక్షణ నిధి ఎందుకో అర్థంకాదు. అలాగే 1970లో థెరిసా ప్రవేశపెట్టిన పిల్లల సంరక్షణ పథకం కింద ఛారిటీ సంస్థ సెంటర్లలో ఉన్న పిల్లలను స్పాన్సర్ చేసేందుకు అనేకమంది ముందుకు వచ్చారు. అలా పిల్లల సంరక్షణకు అయ్యే ఖర్చు ఎవరో భరిస్తున్నప్పుడు ఛారిటీకి విడిగా ఇన్నివేల పౌండ్ల నిధులు ఎందుకు అవసర మవుతాయి?

వసూలవుతున్న విరాళాలకంటే రోమ్‌కు తరలించే నిధులు ఎక్కువకావడంతో 1975 నుంచి బ్రిటన్ ఛారిటీ సంస్థలో లోటుబడ్జెట్ ఏర్పడింది. ఆ తరువాత ఏడాది రోమ్‌కు తరలించిన మొత్తం 2,25,364 పౌంట్లకు పెరగడంతో బడ్జెట్ లోటు కూడా 75,571కి చేరింది. ఒక్క బ్రిటన్ నుంచి రోమ్‌కు తరలించిన సొత్తే లక్షల పౌండ్లు ఉంటే ఇక మొత్తం పాశ్చాత్యదేశాలనుంచి పంపిన నిధులు వందల కోట్లలోనే ఉంటాయి. ఈ సొమ్మంతా వాటికన్ బ్యాంక్‌లో డిపాజిట్ చేశారు. ఇలా సేవా కార్యక్రమాల పేరు చెప్పి దండుకున్న విరాళాలను థెరిసా సంస్థ వాటికన్ బ్యాంకుకు తరలిస్తే, స్వయంగా వాటికన్ బ్యాంక్ నాజీల నుంచి దొంగ సొత్తును పొందింది. వివిధ దేశాల్లో దొంగిలించిన బంగారం, డబ్బునునాజీలు వాటికన్ బ్యాంక్‌లో దాచారు. అలా తరలించిన బంగారంలో వివిధ కాన్సన్‌ట్రేషన్ క్యాంపుల్లో చనిపోయిన వేలాదిమంది యూదుబందీల బంగారపు పళ్ళు కూడా ఉన్నాయి. ఇలాంటి పాపపు, నెత్తుటి సొమ్మును అంగీకరించినందుకుకాలిఫోర్నియాకు చెందిన జనాథన్ లెవీ (Jonathan Levy) అనే న్యాయవాది యూదుబాధితులు, రెండవప్రపంచయుద్ధ బాధితుల తరపున వాటికన్ బ్యాంకు, వాటికన్ పాలకులపై కేసు వేశాడు.

1999, 2000 సంవత్సరాల అకౌంట్లలో మరొక చిత్రమైన ఖర్చుల లెక్క కనిపించింది. ఛారిటీ సంస్థను వదిలిపోయిన సిస్టర్లకు 'నష్టపరిహారం' (ex-gratia payment) చెల్లించినట్లు చూపించారు.

మేరీ లూయిస్ పెయిన్ అనే సిస్టర్‌కి 6129 పౌండ్లు, మరొకరికి 10,000 పౌండ్లు చెల్లించినట్లు ఉంది. కొన్ని దశాబ్దాలుగాఅనేకమంది సిస్టర్లు థెరిసా సంస్థను వదిలి వెళిపోయారు. కానీ ఎవరికీ, ఎప్పుడూ ఇలాంటి నష్టపరిహారం ఇచ్చిన దాఖలాలు లేవు. మరి ఈ పరిహారం ఏ పాపానికో? ఆఫ్రికా దేశాల్లో పనిచేసిన అనేకమంది నన్స్ హత్యకు గురయ్యారని వార్తలు వచ్చాయి. అలాగే ఒకసారి లండన్‌లోని కిల్‌బర్న్ హెూంలో తలదాచుకున్న కొందరు స్థానికులు సజీవదహనానికి గురయ్యారు. 1986లో థెరిసా ప్రైవేటు విమానం ఆఫ్రికాలోని దోడొమాలో కొందరిని

ఢీకొన్నప్పుడు ఇద్దరు పిల్లలతో పాటు ఒక నన్ కూడా చనిపోయారు. కానీ ఈ సంఘటనలు వేటిలోనూ థెరిసా సంస్థ నష్టపరిహారం ఊసెత్తలేదు.

ఇంగ్లండ్‌లోని థెరిసా సంస్థ ఆర్థిక లావాదేవీలు ఇలా ఉంటే అమెరికాలో అవకతవకల గురించి ఆ సంస్థలో పదేళ్ళు పనిచేసిన సుసాన్‌షీల్డ్స్ బయటపెట్టారు. అమెరికాలో సేవాసంస్థలు తమ అకౌంట్లను బహిర్గతం చేయాలన్న నిబంధన లేదు. దీన్ని ఆసరాగా తీసుకుని థెరిసా సంస్థ భారీగానే నిధులు కూడగట్టుకుంది. ఈ నిధుల సేకరణ గురించి షీల్డ్స్ ఇలా రాసింది "విరాళాలు పంపినవారికి కృతజ్ఞతలు తెలుపుతూ ఉత్తరాలు పంపడం నా పని. అందుకని ఎక్కడెక్కడ నుంచి ఎంత విరాళాలు వచ్చేవో బాగా తెలుసు. 50,000 డాలర్ల చెక్కుల కోసం ఎన్ని రసీదులు రాసేవారమో లెక్కే లేదు. విరాళం మొత్తం బాగా ఎక్కువగా ఉంటే అది పంపినవారు మాకు ఫోన్‌చేసి చెక్ అందిందా అంటూ వాకబు చేసేవారు. సాధారణ ప్రజలు కూడా తమ కష్టార్జితాన్ని విరాళంగా పంపేవారు. ఆకలితో అలమటించే ఆఫ్రికా ప్రజలకి, బంగ్లాదేశ్ వరద బాధితులకు, కోల్‌కతా అనాథపిల్లలకు తమ విరాళాలు అందించమని ఉత్తరాలు రాసేవారు. అలా పోగైన విరాళాలన్నీ సంస్థ బ్యాంకు అకౌంట్లలో మురిగేవితప్ప ఎవరికీ చేరేవి కావు. మదర్ థెరిసా చేపట్టిన కార్యకలాపాలకు దైవానుగ్రహం ఉండడంవల్లనే ఇన్ని విరాళాలు వచ్చి పడుతున్నాయని మాకు చెప్పేవారు. అయితే ఎంత సొమ్ము వచ్చినదీ, అది ఎక్కడకి పోతున్నదీ మాకెవరికీ తెలిసేదికాదు. ఎంత వచ్చినా బ్యాంకు అకౌంట్లలోనే ఉండేదితప్ప ఒక్క సెంట్ కూడా ఖర్చుపెట్టేవారుకాదు. డబ్బు విషయంలో ఇంత జాగ్రత్తగా, పొదుపుగా ఉన్న మదర్ ఇతర విషయాలకు వచ్చేసరికి పొదుపు, జాగ్రత్తపెట్టడం వంటివి అసలు పనికిరాదని చెప్పేవారు. ఒకసారి రోమ్‌లో టమాటా పంట విపరీతంగా పండింది. ఛారిటీ సెంటర్‌కి పెద్దఎత్తున టమాటాలు వచ్చాయి. వాటిని ఒకేసారి వాడలేం కనుక టిన్‌లలో భద్రపరచాలని సిస్టర్లు చెపితే థెరిసా ససేమిరా ఒప్పుకోలేదు. వాడలేని టమాటాలు బయటపారేయమని చెప్పారు. పేదరికాన్ని కొనసాగిస్తేనే దైవభావన బలంగా ఉంటుందని మదర్ చెప్పేవారు. అందుకని డబ్బు ఖర్చు పెట్టకూడదని సూచించేవారు. కానీ ఒకపక్క పేదలకు సేవ చేస్తామని, వారిని ఉద్ధరిస్తామని చెపుతూ పేదరికాన్ని పెంచిపోషించాలనుకోవడం దారుణం. మన సిద్ధాంతాల కోసం నిరుపేదలను పావులుగా వాడుకోవడం మంచిదికాదనిపించింది. హైతీ సెంటర్‌లో వాడిన ఇంజెక్షన్ సూదులే పదేపదే ఉపయోగించడంతో అవి మొండిబారిపోయాయి. అయినా కొత్తవి కొనడానికి వీలులేదనే నియమాన్నే సిస్టర్లు పాటించారు. కోట్ల డాలర్లు బ్యాంకుల్లో మూలుగుతుంటే మేం బ్రెడ్, మొదలైన ఆహార పదార్థాల కోసం వ్యాపారులను భిక్షమెత్తేవాళ్ళం. అంతేకాదు ఏదైనా ఉచితంగా వస్తే తీసుకునేవారం. ఎయిర్‌లైన్స్ ఉచితంగా టిక్కెట్లు ఇచ్చేవి. ఆస్పత్రుల్లో అధునాతన

సదుపాయాలతో వైద్యం ఫ్రీ. ఆఖరుకు సెంటర్‌లలో పనిచేయడానికి వచ్చిన కూలీలు కూడాఉత్తినే లేదా అతితక్కువ కూలీకి పనిచేయాల్సిందే. స్వచ్ఛంద సేవకుల ద్వారానే సెంటర్లలో అన్ని పనులు జరిగిపోయేవి. నిధులు ఖర్చుపెట్టడానికి వీలులేదు. విరాళాలు ఇచ్చినవారికి మాత్రం 'మీరు పంపిన విరాళం దేవునికి ఎంతో ప్రియమైన నిరుపేదల సేవ కోసమే ఖర్చు పెడతాం' అని ఉత్తరాలు రాసేవాళ్ళం. ఒకపక్క ఇలాంటి ఉత్తరాలు రాస్తూ, మరోపక్క సెంటర్లలో అభాగ్యులను పెడుతున్న బాధలు చూస్తూ నేను చాలాకాలం నరకం అనుభవించాను. మదర్ థెరిసా ను దేవుని వాక్యమే నడుపుతోందని సరిపెట్టుకోవాలని చాలా ప్రయత్నించాను. టమాటాలను దాచడానికే వీలులేదని చెప్పిన థెరిసా కోట్లాది డాలర్లు ఎందుకు పోగేస్తున్నారో అర్థంచేసుకునేందుకు చాలా ప్రయత్నించాను. కానీ నాకు అర్థం కాలేదు." (Free Inquiry Magazine, United States, 12, January, 1998)

ఎస్.ఎమ్. రాయ్ చౌదరి అనే ఛార్టెడ్ అకౌంటెంట్ 1952 నుంచి కోల్‌కతాలో మిషనరీస్ ఆఫ్ ఛారిటీ అకౌంట్లు చూస్తూ ఉండేవారు. ఆయన ఈ పని ఎలాంటి ఫీజు తీసుకోకుండా ఉచితంగానే చేసిపెట్టేవారు. ఆయన ప్రకారం 1990దశకంలో ప్రతి ఏటా ఛారిటీ సంస్థకు 230 మిలియన్ రూపాయల విరాళాలు అందేవి. అందులో 30 మిలియన్‌లు భారతీయులు అందించినవైతే 200 మిలియన్ రూపాయలు విదేశాల నుంచి వచ్చినవి.

ఆర్థిక లావాదేవీలకు సంబంధించిన లెక్కలు ఎప్పుడూ బయటపడకుండా థెరిసా చాలా జాగ్రత్త తీసుకునేవారు. సొసైటీలు, ట్రస్ట్‌ల రిజిస్ట్రార్ కూడా థెరిసా అనుమతి లేనిదే ఛారిటీ సంస్థ వివరాలు ఏవీ బయటపెట్టడానికి వీలులేదు. అలా ఒకసారి వివరాలు చెప్పినందుకు థెరిసా స్వయంగా రిజిస్ట్రార్ కార్యాలయానికి వచ్చి గందరగోళం సృష్టించారు. దానితో అప్పటి నుంచి ప్రభుత్వ అధికారులు కూడా థెరిసా ఆజ్ఞ కోసం వేచి చూడటం ప్రారంభించారు. ఇదే పరిస్థితి ఇప్పటికీ కొనసాగుతోంది. ఇలా నోబెల్ బహుమతి సొమ్ము, టెంపుల్టన్ ప్రైజ్, అరాఫత్ ఇచ్చిన విరాళంతో సహా కోట్లాది డాలర్లు ఎక్కడికి పోయాయో. ఏమయ్యాయో ఎవరికీ తెలియదు. ఇక పెనిలోప్ క్రజ్ వంటి ప్రముఖ సినీ తారలు, ధనవంతులు ఇచ్చిన విరాళాలకు లెక్కేలేదు. పెనిలోప్ తాను ఒక సినిమా కోసం తీసుకున్న పారితోషకాన్ని మొత్తాన్ని (కోట్ల డాలర్లు) థెరిసా సంస్థకి ఇచ్చేశారు. జెట్ ఎయిర్‌వేస్ కంపెనీ ఒకప్పుడు తన ఆదాయంలో 1 శాతం థెరిసాకు విరాళంగా ఇచ్చింది. ఇలా నాలుగుచేతలా విరాళాలు అందుకున్న థెరిసా తన సెంటర్లలో బాధితులకు ఇచ్చినదేమిటి? మొండిసూదులు,పాతమందులు, ఎందుకూ పనికిరాని పాలపొడి....అదీ థెరిసా సేవ!

+++

అధ్యాయం - 5

# సేవా? మత రాజకీయమా?

ఒక చేతిలో శిలువ, మరో చేతిలో బైబిలుతో మిషనరీలు ప్రపంచాన్ని క్రైస్తవ సామ్రాజ్యంగా, దానికి పోప్‌ను అధిపతిగా చేసేందుకు ఎప్పటినుంచో ప్రయత్నిస్తున్నారు. ఆ క్రైస్తవ మత విలువలను, సామ్రాజ్యవాద ధోరణిని నరనరాన జీర్ణించుకున్న మదర్‌థెరిసా మతరాజకీయాలు నడిపారు. అయితే నేరుగా బైబిల్ చదివించి, బాప్తిజం చేయకుండా సేవ నెపంతో ఆ పని చేశారు. పోప్ ప్రపంచ వ్యాప్తంగా సాగించిన మతరాజకీయాల్లో థెరిసా ఒక దళారీగా పనిచేశారు. కాథలిక్ మతసామ్రాజ్యాన్ని విస్తరించడానికి శాయశక్తులా కృషి చేశారు. నిష్టావంతురాలైన కాథలిక్ మతస్తురాలిగా గర్భపాతం (అబార్షన్), కుటుంబ నియంత్రణలు మాత్రమే ప్రపంచానికి సమస్యలన్నట్లు ఉద్యమించారు. తాను రాజకీయాలకు దూరమంటూనే రాజకీయ మంత్రాంగం నడిపారు. పోప్‌జాన్‌పాల్ ఏం చెపితే అది థెరిసా తుచ తప్పకుండా పాటించేవారు. ఏఏ కార్యక్రమాలు ఎప్పుడెప్పుడు చేపట్టాలన్న ఆదేశాలన్నీ వాటికన్ నుంచే వచ్చేవి. ఆ ఆదేశాలు, ఆలోచనల్ని తెలుసుకునేందుకు థెరిసా తరుచు వాటికన్ వెళ్ళివస్తూఉండేవారు. పోప్‌పట్ల థెరిసా భక్తిభావం ఎంతటిదంటే పోప్ కోల్‌కతా పర్యటనేతన జీవితంలో అత్యంత సంతోషకరమైన సంఘటన అని థెరిసా ప్రకటించారు. కాథలిక్కులు చాలా తక్కువగాఉన్న నగరానికి కాథలిక్ మతపెద్దను తీసుకురావడంలో థెరిసా మతనిష్ట, తన మతమే అధిపత్యాన్ని సంపాదించాలనే కోరిక కనిపిస్తాయి. కుటుంబనియంత్రణ, అబార్షన్‌లు క్రైస్తవ మత సూత్రాల ప్రకారం చాలా ఘోరమైన పాపాలని పోప్ ప్రకటించారు. అంతే ఈ రెండు అంశాలనే ప్రపంచ సమస్యలు చేయాలని థెరిసా నిర్ణయించుకున్నారు.

అలాగే మహిళా మత బోధకులకు (women priests) స్థానం లేదని పోప్ స్పష్టం చేసిన తరువాత తాను మహిళ అయిఉండీ మహిళా మతబోధకులను థెరిసా వ్యతిరేకించారు. 1983లో అమెరికా నన్స్ యూనియన్ పోప్ అభిప్రాయాన్ని వ్యతి రేకిస్తూ మహిళా మతబోధకులకు కూడా అవకాశం ఇవ్వాలంటూ తీర్మానం ఆమోదించింది. సొంత క్రైస్తవ గూటిలోనే నిరసనలు, అసమ్మతి స్వరాలు వినిపించడంతో పోప్ సమస్య పరిష్కారాన్ని థెరిసా చేతిలో పెట్టారు. తన అంతర్జాతీయ ఇమేజ్‌తో థెరిసా నన్స్ యూనియన్‌ను దారికితెచ్చారు.

పోప్‌జాన్‌పాల్‌తోనేకాదు వివిధ దేశాల్లోని క్రైస్తవ మత పెద్దలందరితో థెరిసా సన్నిహితంగా మెలిగేవారు. ఇతర మతాల పట్ల తీవ్ర అసహనాన్ని ప్రదర్శించే కార్డినల్ రాట్జింగర్ (ప్రస్తుత పోపు బెనడిక్ట్ అసలు పేరు రాట్జింగర్) (Ratziner) అంటే థెరిసాకుప్రత్యేక అభిమానం, బౌద్ధమతమంటే రాట్జింగర్ విపరీతమైన ఏహ్యాభావం. అది ఒక అసహ్యాకరమైన, అసభ్యకరమైన మతమని ఆయన అనేకసార్లు వ్యాఖ్యానించారు. తీవ్ర మతద్వేషం, మహిళా ద్వేషం ప్రదర్శించే ఇంక్విజిషన్‌వంటి సంస్థలు, మతాధికారులందరితో థెరిసా సన్నిహితంగా మెలిగేవారు. అందుకనే వాటికన్ కీలక బృందాలలో ఆమెకు సభ్యత్వంఉండేది. క్రైస్తవేతర దేశాల్లో మతవ్యాప్తికి థెరిసా మంచి దళారీగా ఉపయోగపడుతుందని పోప్ భావించారు. అందుకు తగినట్లుగానే ముస్లిం, కమ్యూనిస్టు దేశాల్లో కూడా తన సెంటర్లు తెరిచి థెరిసా ఆ నమ్మకాన్ని నిలబె ట్టుకున్నారు. ఇథియోపియా, లిబియా, టునీషియా, ఇరాక్ వంటి దేశాల్లో కూడా పాగా వేశారు. థెరిసాను కాదంటే అంతర్జాతీయ ప్రపంచంలో చెడ్డపేరు తెచ్చుకోవడమేనని భయపడ్డ క్యూబా అధ్యక్షుడు ఫైడల్ కాస్ట్రో ఆమె పర్యటనకు అనుమతించాడు. అలా క్యూబా పర్యటనకు వచ్చిన థెరిసా తనది 'ఆధ్యాత్మిక పర్యటన' అంటూ ప్రకటించారు. క్యూబా తరువాత సోవియట్ యూనియన్‌లో అడుగుపెట్టాలని థెరిసా భావించారు. తన పర్యటనకు పర్మిషన్ ఇవ్వాలంటూ అధ్యక్షుడు గోర్బచేవ్‌కు లేఖలు రాశారు. చివరికి 1987లో మాస్కోలో పర్యటించారు. 21, ఆగస్ట్, 1987 మాస్కోలో కార్ల్‌మార్క్స్ చిత్రపటం కింద థెరిసా విలేకరులను ఉద్దేశించి మాట్లాడుతున్న ఫోటోను పత్రికలు ప్రముఖంగా ప్రచురించాయి. ఇలా అనేక కమ్యూనిస్టుదేశాలలో మత పర్యటనలు చేసిన థెరిసా చైనాలో మాత్రం అడుగుపెట్టలేకపోయారు.

లాటిన్ అమెరికాపై పోప్, మదర్‌థెరిసాలు ప్రత్యేక దృష్టిపెట్టారు. అక్కడి సోషలిజాన్ని కాథలిసిజమ్‌తో ఎదుర్కోవాలని ప్రయత్నించారు. క్రైస్తవుల్లో కొత్తగా ప్రవేశించిన 'లిబరేషన్ థియాలజీ'ని వాళ్లు అంగీకరించలేదు. ఇది క్రైస్తవంలో మార్క్సిస్ట్ కల్తీ అని భావించారు. ముఖ్యంగా సామాజిక, సేవా కార్యక్రమాల్లో పాల్గొనే మత బోధకులంటే థెరిసాకు చిన్నచూపు ఉండేది. 'మీరంతా సామాజిక సేవ చేయడానికి మతబోధకులు కాలేదు' అని తీవ్ర వ్యతిరేకతను వ్యక్తం చేసేవారు.

దక్షిణ అమెరికాలో పోప్ ప్రదర్శించిన ద్వంద్వ వైఖరివల్ల స్థానిక క్రైస్తవ బోధకుల్లో ఆయనపట్ల సదభిప్రాయం లేదు. అలాగే పోప్ దళారిగా పనిచేసిన

థెరిసాపై కూడా గౌరవం లేదు. ఒకసారి బ్రెజిల్‌లో మిషనరీస్ ఆఫ్ ఛారిటీ సెంటర్ తెరవడానికి ప్రయత్నిస్తే స్థానిక మతబోధకులు అడ్డుకున్నారు కూడా. దక్షిణ అమెరికా ఎల్‌సాల్వెడార్‌లో నిరంకుశపాలన సాగిస్తున్న మిలటరీ ముఠాకు పోప్ పరోక్ష మద్దతునివ్వడమే స్థానికుల అసంతృప్తికి కారణం. తూర్పు యూరప్ (కమ్యూనిస్ట్)దేశాల్లో మానవహక్కుల ఉల్లంఘన జరిగిపోతోందంటూ గగ్గోలుపెట్టిన పోప్ ఎల్‌సాల్విడార్‌లో మిలటరీ పాలకుల అకృత్యాల గురించి మాత్రం నోరు మెదపలేదు. పైగా ఆ పాలకుల చేతిలో క్రైస్తవ బోధకులు (ప్రీస్ట్‌లు) హత్యకు గురవు తున్నా పట్టించుకోలేదు. పోప్ ధోరణికి విసిగి ఎల్‌సాల్విడార్‌కు చెందిన ఆర్చ్‌బిషప్ రొమెరో ఈ విషయంపై చర్చించడా నికి వాటికన్ వెళ్ళారు. వాటికన్‌కు వచ్చే ఆర్చ్‌బిషప్‌లకు ఎలాంటి అడ్డంకి లేకుండా వెంటనే పోప్ దర్శనం అవుతుంది.కానీ పోప్‌ను కలిసేందుకు రొమెరో ఆరు వారాలు ఆగాల్సివచ్చింది. ఆ తరువాత జరిగిన సమావేశంలో కూడా ఎక్కువ సేపు మాట్లాడని పోప్ మిలటరీ పాలకులకు వ్యతిరేకంగా కార్యకలాపాలు నిర్వహించవద్దంటూ సలహా మాత్రం ఇచ్చి పంపేశారు. అలా పోప్ కోపానికి గురైన ఆర్చ్‌బిషప్ రొమెరో ఆ తరువాత పదినెలలకే అమెరికా ఇంటలిజెన్స్ సంస్థ సిఐఎ కిరాయి హంతక ముఠా చేతిలో హత్యకు గురయ్యారు.

హైతీ మిలటరీ నియంతలకు కూడా వాటికన్ మద్దతు ఉండేది. నిరంకుశపాలకుడు దువలియర్ (Duvalier), అతని కుటుంబమంటే థెరిసాకు ఎక్కడలేని గౌరవం, అభిమానం. 1991లో ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికైన జీన్ బెర్ట్రాండ్ అరి స్టైడ్‌ను గద్దె దింపి మిలటరీ పాలకుడు (దువలియర్) అధికారం చేపట్టినప్పుడు ఆ ప్రభుత్వాన్ని గుర్తించిన ఏకైక రాజ్యంకాని రాజ్యం వాటికన్. హైతీ మిలటరీ ప్రభుత్వం విషయంలో వాటికన్ వింత ధోరణిని గురించి పోప్‌జాన్‌పాల్ జీవిత చరిత్ర రాసిన టాడ్ జూల్ ఆశ్చర్యం వ్యక్తం చేశాడు - "హైతీ మిలటరీపాలనలో మానవహక్కుల ఉల్లంఘన, హత్యల గురించి వాటికన్ ఏమీ మాట్లాడకపోవడం విచిత్రంగా ఉంది. అలాగే బెర్ట్రాండ్ అరిస్టైడ్‌కు తిరిగి పట్టంకట్టా లన్న డిమాండ్‌కు వాటికన్ మద్దతు తెలపలేదు. వాటికన్ ధోరణితో విసుగెత్తిన అరిస్టైడ్ మతాధికారి పదవిని పదులుకున్నారు." (Tad Szluc, pope paul II The Bigraphy, Simon & schmster, 1995,p.479) హైతీలో హేయమైన మిలటరీ నియంతలకు మద్దతు తెలపడమేకాక, వారి నుంచి భారీగా

విరాళాలు పొందారు మదర్ థెరిసా. వారిని పొగడ్తలతో ముంచెత్తారు. ఆతిథ్యం ఇచ్చినవారిపట్ల గౌరవపూర్వకంగా అలా మాట్లాడటం మామూలేనని థెరిసా అభిమానులు అంటూ ఉంటారు. కానీ ఇతరుల గురించి ప్రశంసాపూర్వకంగా మాట్లాడటం థెరిసా జీవితంలో చాలా అరుదనేసంగతి వారికి తెలియదు. హైతీ నియంతలు, స్టార్‌వార్‌ను ప్రోత్సహించిన అమెరికా అధ్యక్షుడు రోనాల్డ్ రీగన్ వంటి అతి తక్కువ మందిపైనే థెరిసా ప్రశంసలు కురిపించారు. 2000 నాటికి రోమ్‌లో జిప్సీలు (భారత సంతతికి చెందిన జిప్సీలు ఒక సంచార జాతి) పూర్తిగా లేకుండా చేస్తానని ప్రతిజ్ఞ చేసిన మేయర్ రూటెల్లీ అంటే థెరిసాకు ప్రత్యేక అభిమానం. కాథలిక్ మతావేశం, అబార్షన్ వ్యతిరేకత ఉంటే చాలు ఎంత నిరంకుశులైనా, ఎన్ని అకృత్యాలు చేసినా థెరిసాప్రశంసలు పొందవచ్చును. ఆమె సంస్థకు విరాళాలు ఇస్తే ఎలాంటి నేరాలు చేసినా ఫరవాలేదు. ప్రపంచంలో బాధలు, కష్టాలు ఉన్నాయని థెరిసా వాపోయేవారు. బాధ అంటే అబార్షన్, కష్టాలు అంటే కుటుంబనియంత్రణ అని అర్థం. క్యూబావంటి కమ్యూనిస్ట్ దేశాలను అస్థిరపరచేందుకు వాటికన్ అన్నిరకాల ప్రయత్నాలు చేసింది. కుటుంబ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసి అక్కడ సామాజిక దుస్థితి తేవాలని చూసింది. అమెరికా ప్రభుత్వం, కాథలిక్ చర్చ్ కలిసి రహస్యంగా అమలుచేసిన ఆపరేషన్ పీటర్‌పాన్ (Operation Peter Pan)కు మద్దతు తెలిపింది.

క్యూబా పిల్లలను తల్లిదండ్రుల నుంచి వేరుచేసివారిని అమెరికాలోని కాథలిక్ కుటుంబాలకు అప్పగించడమే ఆపరేషన్ పీటర్‌పాన్. ఆ విధంగా కమ్యూనిస్ట్ దేశమైన క్యూబాను అస్థిరపరచడం అమెరికా లక్ష్యమైతే, కాథలిక్ మతవ్యాప్తి చేయడం వాటికన్ ఉద్దేశ్యం. ఇలా రాజకీయ, మత లక్ష్యాల కోసం అమెరికా, వాటికన్‌లు చెట్టాపట్టాలు వేసుకుని కుట్రలు, కుతంత్రాలు అమలు చేశాయి, చేస్తున్నాయి.

**తూర్పు యూరప్ దేశాల్లో కూడా వాటికన్, సిఐఎ కలిసి పని చేశాయి. అక్కడి ప్రభుత్వాల్ని కూలదోశాయి. సేవ పేరు చెప్పి వాటికన్ ప్రతినిధిగా థెరిసా ఆ ప్రక్రియలో పాలుపంచుకున్నారు.** తూర్పు బెర్లిన్ (ఒకప్పటి తూర్పుజర్మనీ)లో సెంటర్ ప్రారంభించిన థెరిసా సేవకంటే 'సామూహిక ప్రార్థన' (outdoor mass)ల పైనే దృష్టి పెట్టారు.

అప్పటికే నోబెల్ ప్రైజ్ తీసుకున్న థెరిసాను తూర్పుజర్మనీ అధికారులు కాదనలేకపోయారు. అలా 1981లో అమెరికా, సోవియట్ యూనియన్ మధ్య ప్రచ్ఛన్న యుద్ధం జోరుగా సాగుతున్న సమయంలో థెరిసా సామూహిక ప్రార్థనల

ద్వారా కాథలిక్ మత వ్యాప్తికి, తద్వారా అమెరికా అనుకూల వ్యవస్థ ఏర్పాటుకు ప్రయత్నించారు. ఎప్పుడైతే అస్థిరత పెరిగిపోయి, రాజకీయ వ్యవస్థ కూలిపోయి తూర్పుజర్మనీ పశ్చిమజర్మనీతో కలిసి పోయిందో ఆ మరుక్షణం థెరిసా సెంటర్ మూతపడింది. బెర్లిన్ గోడ (తూర్పు, పశ్చిమ జర్మనీల మధ్య ఉన్న గోడ. తూర్పుజర్మనీలో కమ్యూనిస్ట్ వ్యవస్థ కూలిపోయిన తరువాత ఈ గోడను కూల్చేశారు.అప్పుడు ఐక్యజర్మనీ ఏర్పడింది) కూలిన రెండురోజులకే థెరిసా సెంటర్ మూతపడింది. నిజానికి అలాంటి రాజకీయ, సామాజిక, ఆర్థిక అస్థిర పరిస్థితుల్లోనే ప్రజలకి సహాయం అవసరమవుతుంది. నిజంగా సేవ చేయాలనుకున్నవాళ్ళు ఎవరూ అప్పుడు సెంటర్లు మూసుకోరు. దేశాలమధ్య వైరం ఉన్నచోట థెరిసా ఆటలు బాగా సాగుతాయని, ఐక్యత ఉన్నచోట సాగవనటానికి ఇదొక ఉదాహరణ.

మాతృదేశం అల్బేనియాలో కూడా థెరిసా ఇలాంటి మతరాజకీయాలే నడిపారు. వామపక్ష పాలన అంతం కావడానికి సెంటర్ల ద్వారా శాయశక్తుల కృషి చేశారు. అసంతృప్తి, అస్థిరత్వం పెరిగిపోయి ప్రజలు వీధుల్లోకి వచ్చినప్పుడు థెరిసా తీరికగా అల్బేనియా అడుగుపెట్టారు. అయితే తన మతరాజకీయాలు బయటపడకుండా థెరిసా ఎంతో జాగ్రత్త తీసుకునే వారు. ప్రత్యర్థులకు తన ఆచూకీ కూడా తెలియనిచ్చేవారు కాదు. అల్బేనియాకు వెళ్ళేముందు నెలరోజులపాటు రోమ్‌లో వేచి చూశారు. భారత్ నుంచి రోమ్‌కు రహస్యంగా వెళ్ళారు. ఎంత రహస్యంగానంటే ప్రయాణించిన ఎయిర్ఇండియా విమానపు ప్రయాణికుల లిస్ట్‌లో ఆమె పేరు కూడా లేదు. ఈ రహస్య ప్రయాణం గురించి థెరిసా అధికారిక జీవిత చరిత్రలో కూడా ఉంది. (Kathryn Spink, Mother Teresa An Authorised Biography, Harpercollins, 1997,p.238)

అమెరికా, సోవియట్ యూనియన్ల మధ్య ప్రచ్ఛన్నయుద్ధం సాగుతున్న సమయంలో అనేకమంది అమాయకులు జైలుపాలయ్యేవారు. అలాంటివారికి మాట సహాయం చేసి విడిపించే వీలున్నా థెరిసా ఎప్పుడూ ఆ పని చేయలేదు. చేయని నేరానికి ఒక యువ రష్యా శాస్త్రవేత్త జైలు పాలైతే అతన్ని వదిలిపెట్టాలంటూ 1979లో నోబెల్ ప్రైజ్ విజేతలంతా రష్యాఅధ్యక్షుడు బ్రెజ్నెవ్‌కు ఉత్తరం రాశారు. అయితే థెరిసా మాత్రం ఆ ఉత్తరం మీద సంతకం పెట్టేందుకు నిరాకరించారు.

కాథలిక్ మత ప్రచారంతోపాటు పోప్ ప్రవచించిన అబార్షన్, కుటుంబ నియంత్రణ వ్యతిరేకతను థెరిసా ఎంతో శ్రద్ధగా అనుసరించేవారు. **అబార్షన్, కుటుంబనియంత్రణలను చట్టబద్ధం చేయాలంటూ కోరిన కైరో జనాభా సదస్సు 1994ను థెరిసా, పోప్ కలిసి భ్రష్టుపట్టించారు.** మహిళలు, పిల్లలు అసలే లేని వాటికన్‌కు, క్రైస్తవ సన్యాసి అయిన థెరిసాకు ఆ సమావేశంలో పాల్గనేందుకు ఆహ్వానం రావడమే

విచిత్రం. సదస్సు చివరలో ప్రవేశపెట్టిన తీర్మానంలో 'తప్పని పరిస్థి తుల్లో అబార్షన్‌ను అనుమతించాలి' అనే వాక్యాన్ని తొలగించాల్సిందేనని పోప్, థెరిసా పట్టుబట్టారు. అత్యాచారానికి గురైనఅభాగ్యులకు కూడా అబార్షన్ చేయించుకునే అవకాశం ఉండకూడదని వాళ్లు తేల్చిచెప్పారు. అబార్షన్లను సమ ర్థించిందనే కారణంతో 1996లో వాటికన్ ఏకంగా యూనిసెఫ్‌కే విరాళాన్ని రద్దు చేసింది. మధ్య ఆఫ్రికా నిర్వాసితుల శిబిరాల్లో అత్యాచారాలకు గురైన మహిళలకు గర్భ నిరోధ మాత్రలు యూనిసెఫ్ సరఫరా చేసినందుకు వాటికన్ 2500 డాలర్ల వార్షిక విరాళాన్ని రద్దు చేసింది. కైరో కాన్ఫరెన్స్‌ని భ్రష్టుపట్టించిన తరువాత 1995లో బీజింగ్ (చైనా) మహిళా సదస్సుపై థెరిసా దృష్టి పెట్టారు. ఇందులో తానుప్రత్యక్షంగా పాల్గనకుండా తన ప్రతినిధి మెర్సిడెస్ విల్సన్ ద్వారా లేఖ పంపారు. థెరిసా సంతకం కూడా లేని ఆ ఉత్త రాన్ని విల్సన్ ఆ సదస్సులో చదివి వినిపించారు.

"ఉద్యోగాలు, ఉన్నత వృత్తివ్యాపారాలు, స్వేచ్ఛాసమానత్వాల కోసం ఆరాటంకంటే ప్రేమ ముఖ్యమైనది. కానీ వీటికోసం వెంపర్లాడుతున్న మహిళలు అబార్షన్లు చేయించుకుంటున్నారు."

మహిళలు ఉన్నత స్థానాల కోసం ప్రయత్నించడం తప్పని, అలాంటి ఆకాంక్షవల్లనే పిల్లలు పద్దనుకుంటున్నారని,థెరిసా తన సందేశంలో పేర్కొన్నారు. ఇంతటి స్త్రీ స్వేచ్ఛా వ్యతిరేక సందేశాన్ని వినిపించిన థెరిసాను ఏ మహిళావాదులూ ఎప్పుడూ వేలెత్తి చూపిన దాఖలాలు లేవు. విచిత్రమేమిటంటే ఇలాంటి స్త్రీ స్వేచ్ఛకు వ్యతిరేకమైన థెరిసా సందేశానికి విపరీతమైన ప్రచారం ఇచ్చిన పత్రికలు బీజింగ్ సదస్సుకు మద్దతుగా వేలాదిమంది కోల్‌కతా నిరుపేద మహిళలు పంపిన (కుటుంబ నియంత్రణ సంస్థ ద్వారా) సంతకాల సందేశం గురించి మాత్రం ఒక్కముక్క రాయలేదు. ఇంకో విచి త్రమేమిటంటే స్త్రీ స్వేచ్ఛ అవసరమేలేదంటూ ప్రవచించిన థెరిసాకు ఉన్న వీరభక్తురాళ్లలో జోన్ కాలిన్స్, జూలియా రాబర్ట్స్(ప్రముఖ నటి), గినా లోలో్బ్రిగిడా, ఎలిజిబెత్ టైలర్ (ఎనిమిది పెళ్ళిళ్ళు చేసుకున్న ప్రముఖ నటి), ఎలిజిబెత్ హర్లే (నటి), పెనిలోప్ క్రుజ్ (నటి) వంటి చాలామంది కెరీర్ కోసం కుటుంబం, పిల్లలు పద్దనుకున్నవాళ్ళే! ఇలాంటి వారినుంచి థెరిసా నిర్మొహమాటంగా, నిరభ్యంతరంగా భారీ విరాళాలు పుచ్చుకున్నారు.

అబార్షన్ వంటి వ్యక్తిగత విషయాలను రాజకీయ అంశంగా, అంతర్జాతీయ సమస్యగా చేయడం థెరిసాకే చెల్లింది. ఇ లాంటి అర్థంలేని ధోరణివల్ల అనేకమంది అమాయక మహిళలకు తీరని నష్టం జరిగింది. ఈ నష్టం జరుగుతోందని తెలిసినా థెరిసా తన తలాతోకలేని మతవిశ్వాసాన్నే పట్టుకువేళ్ళాడారు. 1971 తూర్పుపాకిస్థాన్ (ఇప్పటి బంగ్లాదేశ్) యుద్ధ సమయంలో పాకిస్థానీ సైనికుల చేతిలో అత్యాచారానికి

గురైన అమాయక మహిళలకు థెరిసా ఇలాంటి సందేశమే వినిపించారు. అత్యాచారానికి గురైనవారెవరూ అబార్షన్ చేయించుకోవద్దని, పిల్లల్ని కనమని ఆమె చెప్పారు. (థెరిసా అమానుష ధోరణిని ఏ ప్రముఖుడు ప్రశ్నించలేదు. ఏ పత్రికా ఎత్తిచూపలేదు). ఈ ధోరణిని వ్యతిరేకించిన జర్మైన్ గ్రీర్ (Germaine Greer) ను థెరిసా వీర అభిమానులైన జర్నలిస్ట్‌లు 'మూర్ఖ మహిళావాది' అని ఎగతాళి చేశారు.

పాకిస్థాన్ సైనికుల అకృత్యాల గురించి జోయస్ గోల్డ్‌మాన్ (Joyce Goldman) అమెరికా పత్రిక మిస్ (Ms, August,1972, p.84,88) లో రాసింది. ఆ వ్యాసం చదివితే మూర్ఖత్వం, అమానుషత్వం ఎవరివో అర్థమవుతుంది.

సైనిక శిబిరాలలో బంగ్లా మహిళల్ని 'సిగరెట్‌మిషన్లు' గా ఎలా వాడినదీ స్వయంగా ఒక సైనికుడు చెప్పిన మాటల్ని గోల్డ్‌మాన్ పేర్కొంది. 'చనిపోయేవరకు ఆడపిల్లలపై అత్యాచారం చేసేవారం' అన్న సైనికుడి కథనంతోపాటు ఎనిమిదేళ్ళ పిల్లలపై సైనికులు సాగించిన అకృత్యాలను, చూపిన రాక్షసత్వాన్ని కూడా గోల్డ్‌మాన్ ఆ వ్యాసంలో కళ్ళకుకట్టిన ట్లు చెప్పింది. ఇంతటి ఘోరాలకు బలైన అమాయక మహిళలు, ఆడపిల్లల తరపున ఒక్కమాట కూడా మాట్లాడని థెరిసా అబార్షన్ మాత్రం చేయించుకోవద్దని సలహా ఇవ్వడం అమానుషత్వంకాక మరేమిటి? అత్యాచారానికి గురైన మహిళల్ని పట్టించుకోని ఆమె వారికి పుట్టే పిల్లలకి మాత్రం సంరక్షణ కల్పిస్తామంటూ (సంరక్షణ అంటే కోల్‌కతా శిశుభవన్‌లో మాదిరిగా కల్తీపాలు పట్టడం, రోగాలువస్తే మందు వేయకపోవడం. ఆ తరువాత వారిని ఏ విదేశీ కాథలిక్‌తో దత్తత ఇచ్చేసి, వారి నుంచి భారీగా విరాళాలు పుచ్చుకోవడం) ముందుకువచ్చారు.

అబార్షన్ వ్యతిరేక సందేశాన్ని వినిపించడానికి ప్రపంచమంతా పర్యటించిన థెరిసా 1981లో జపాన్ వెళ్ళారు. జపాన్ కాథలిక్‌లు ఏర్పాటుచేసిన అనేక సభల్లో పాల్గన్నారు. విపరీతమైన మీడియా ప్రచారం కూడా పొందారు. ఆ పర్యటన బాగా సాగడంతో మరుసటి ఏడాది కూడా జపాన్‌కు వెళ్ళారు. ఆ దేశపు ఎంపిలతో జరిగిన ప్రత్యేక సమావేశంలో జపాన్‌లో అబార్షన్ చట్టాలను మరింత కఠినతరం చేయడానికి దాదాపు ఒప్పించారు. ఆ పర్యటన సమయంలోనే నాగసాకిలోనిఅణుబాంబు మృతుల స్మృతి కేంద్రాన్ని సందర్శించారు. అమెరికా వేసిన అణుబాంబువల్ల జరిగిన అపార నష్టం, దానికిగురైన ప్రజానీకం గురించి ఒక్కమాట కూడా మాట్లాడని థెరిసా ప్రపంచశాంతికి తీవ్ర విఘాతం కలిగించేది అబార్షన్లే అని సందేశం వినిపించారు! అంటే ఆమె దృష్టిలో అణుబాంబుకంటే అబార్షనే ప్రమాదకరమన్నమాట!

1984 అమెరికా అధ్యక్ష ఎన్నికల సందర్భంగా కూడా థెరిసా చురుకుగా తన మత (అబార్షన్) రాజకీయ కార్యకలాపాలను నిర్వహించారు. అబార్షన్‌వంటి అంశాలు వ్యక్తిగత మైనవని, ఎవరి అవసరాలు, పరిస్థితులకు అనుగుణంగా వారు

నిర్ణయాలు తీసుకోవాలని భావించిన గెరాల్డిన్ ఫెరారో (Geraldine Ferraro) కు వ్యతిరేకంగా థెరిసా ఏకంగా ఎన్నికల ప్రచారమే చేశారు. 15, అక్టోబర్,1984 న్యూయార్క్‌లో కార్డినల్ ఒకానర్ (Cardinal O`connor) ఒక సభలో ఫెరారోకు వ్యతిరేకంగా నిప్పులు చెరిగాడు.

ఎలాంటి ముందస్తు ప్రకటన లేకుండా థెరిసా ఆ సభలో ప్రత్యక్షమయ్యారు. వేదికమీద కూర్చుని కార్డినల్‌కు మద్దతు తెలిపారు. అయితే తాను 'అనవసర రాజకీయాల్లో' తలదూర్చానంటూ కార్డినల్ ఒకానర్ ఒప్పుకున్నారు. (Catholic News service, September,1998) థెరిసా మాత్రం ఏనాడూ అలాంటి నిజాయితీ చూపించలేదు.

1993 లో ఐర్లాండ్ రాజధాని డబ్లిన్‌కు చెందిన ఒక 14 ఏళ్ళ బాలిక విషయంలో కూడా థెరిసా అంత అసంబద్ధంగా, మొండిగానే వ్యవహరించారు. ఒక వివాహితుడి చేతిలో అత్యాచారానికి గురైన ఈ బాలిక కేసు అప్పట్లో సంచలనం సృష్టించింది. అప్పుడే ఐర్లాండ్ పర్యటనకు వెళ్లిన థెరిసాను అక్కడి 98 ఎఫ్ఎం రేడియో ఇంటర్వ్యూ చేసింది.

క్రైస్తవ ప్రీస్ట్ మైకెల్ క్లారీ (Michael Cleary) (ఈయనకి పెళ్లయిందని, ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారని ఆ తరువాత తెలిసింది) థెరిసాను ఇంటర్వ్యూ చేశాడు. 'అబార్షన్ అంటే చంపడం కనుక దానిని ఎట్టి పరిస్థితుల్లోనూ అంగీకరించలేము' అనే దృఢమైన అభిప్రాయం కలిగిన క్లారీ చట్టాన్ని (అబార్షన్) మార్చేందుకు మితవాదులు ఈ సంఘటనను వాడుకోవాలను కుంటున్నారని, **దీనిపై అభిప్రాయం ఏమిటని థెరిసాను అడిగాడు. ఏ పరిస్థితుల్లోనైనా అబార్షన్‌ను అంగీకరిస్తారా అని ప్రశ్నించాడు. అందుకు ఆమె 'ఎట్టి పరిస్థితిలోనూ అంగీకరించను' అని తేల్చిచెప్పారు.** (Wendy Holden, unlawful carnal knowledge :The True strory of the Irish X case, Harper Collins, 1994,p.114)

అబార్షన్‌ను నిషేధించాలని థెరిసా ఎన్ని సామూహిక ప్రార్థనా సమావేశాలు నిర్వహించినా లాభం లేకపోయింది. ఈ అంశంపై ప్రభుత్వం నిర్వహించిన ప్రజాభిప్రాయ సేకరణలో ఎక్కువమంది అబార్షన్ హక్కు ఉండాల్సిందేనని చెప్పారు.దానితో ఇతర దేశాలకు వెళ్ళి అబార్షన్ చేయించుకోవచ్చని చట్టంలో మార్పు చేశారు. ఇంగ్లండ్‌లో అబార్షన్ (అనుకూల) బిల్‌ను అడ్డుకోవాలనుకున్న థెరిసాకు అక్కడ కూడా చుక్కెదురైంది. ఏకంగా ఎంపిలనే తనకు మద్దతుగా తెచ్చుకున్నా ప్రజాభిప్రాయం ముందు థెరిసా పప్పులు ఉడకలేదు.

**ఐర్లాండ్‌లో అబార్షన్, విడాకులకు వ్యతిరేకంగా చట్టాలు చేయాలంటూ వాదించిన థెరిసా తన రెచ్చగొట్టే ఉపన్యాసాలతో రాజకీయ వర్గాల మధ్య చిచ్చుపెట్టారు.**

ఐర్లాండ్ రాజకీయాల్లో ఆమె జోక్యం అక్కడి ప్రముఖులు, పత్రికా రచయితలకు కోపం తెప్పించింది. 'పసిపిల్లల్ని క్రైస్తవ ప్రీస్ట్‌లు అత్యాచారం చేస్తే నోరుమెదపని వారంతా ఇప్పుడు చాలా మాట్లాడుతున్నారు' అంటూ ప్రముఖ ఐరిష్ రచయిత జెన్ కారిగన్ (Gene Kerrigan) నిరసన తెలిపాడు. (Sunday Independent, Dublin, 26, November, 1995) థెరిసా ప్రార్థనలు ఫలించక ఐర్లాండ్‌లో అబార్షన్, విడాకుల (అనుకూల) చట్టం అమలులోకి వచ్చింది.

అబార్షన్, విడాకుల వ్యతిరేక మత సిద్ధాంతం కేవలం సామాన్యులు, పేదల విషయంలోనే అమలుచేసేవారు థెరిసా, పోప్. 'అందరూ సమానమేకానీ, ధనికులు, ఉన్నత వర్గాలవారు ఎక్కువ సమానం' అన్నట్లుగా వ్యవహరించేవారు. విడా కులను తీవ్రంగా వ్యతిరేకించిన థెరిసా ప్రిన్స్ డయానా విడాకులు తీసుకోవడాన్ని మాత్రం సమర్థించారు (ఇందుకు కాథలిక్‌లకు, బ్రిటిష్ చర్చ్‌కు మధ్య గొడవలు కారణం కావచ్చును). ' మొత్తానికి అది (విడాకులు తీసుకోవడం) పూర్తయింది. నిజానికి నేను కుటుంబ బంధం, ప్రేమ గురించి చెప్పాలి. కానీ ఇక్కడ పరిస్థితి వేరు.....' అంటూ సమర్థించుకున్నారు. (Ladies Home Journal , New York, 1, April, 1996). ఎన్ని కష్టాలు వచ్చినా విడాకులు తీసుకోకూడదని సాధారణ మహిళలకు చెప్పిన థెరిసా డయానా విషయానికి వచ్చేసరికి అక్కడ పరిస్థితి వేరంటూ కారణాలు వెతికారు. నిజానికి సాధారణ మహిళలు ఎదుర్కొనే కష్టాలు ఏవీ డయానాకు లేనేలేవు. అవి రానూరావు. వ్యక్తిగత స్వేచ్ఛ పేరుతో విచ్చలవిడితనానికి అలవాటుపడిన డయానా విడాకులు తీసుకో వచ్చని చెప్పిన థెరిసా, భర్తల చేతిలో శారీరక, మానసిక హింసను అనుభవిస్తున్న సాధారణ మహిళలకు మాత్రం మరోలా చెప్పారు. పోప్ కూడా మోనాకో రాజకుటుంబం విషయంలో ఇలాంటి ద్వంద్వవైఖరినే అవలంబించారు. సాధారణ కాథలిక్‌లకు లేని అవకాశం, స్వేచ్ఛ ధనిక, రాచరిక వర్గాలకు మాత్రం ఉంటుందని చెప్పారు.

పసిపిల్లలపై అత్యాచారాలు జరిపిన క్రైస్తవ ప్రీస్ట్‌ల గురించి ఎవరైనా నిలదీస్తే థెరిసా సమాధానం చెప్పకుండా దాట వేసేవారు. లేకపోతే ఎక్కడలేని క్షమాగుణాన్ని, ప్రేమను ప్రదర్శించేవారు. (భోపాల్ గ్యాస్ దుర్ఘటన సమయంలోనూ థెరిసా ఇలాంటి 'అపారమైన క్షమాగుణాన్నే' ప్రదర్శించారు. యూనియన్ కార్బైడ్ నరహంతకుల్ని క్షమించేయండని . వేలాదిమంది బాధితులకు సలహా ఇచ్చారు.) ఒకసారి ఐర్లాండ్‌కు చెందిన జర్నలిస్ట్ కాథే వార్డ్ క్రైస్తవ ప్రీస్ట్‌ల కామక్రీడల గురించి పదేపదే అడగడంతో, ఇక తప్పనిసరి అయి థెరిసా ఇలా సమాధానం చెప్పారు - "అలాంటి భయంకర మైన,తీవ్రమైన చంచలత్వానికి గురవుతున్న (ప్రీస్ట్‌లు) వారి

గురించి ప్రార్థించండి. వారి కోసం త్యాగాలు చేయండి." (Sun day Independent, Dublin, 1,October,1995)

త్యాగాలుచేయడమంటే ఆవిడ దృష్టిలో ఎంతమంది ప్రీస్ట్‌లు, ఎన్ని ఏళ్ళపాటైనా, పసిపిల్లలపై అకృత్యాలకు పాల్పడుతున్నా నోరుమెదపకుండా ఊరుకోవాలి. కనీసం ప్రశ్నించకూడదు. (ఈ ప్రీస్ట్‌ల ఘోరకృత్యాలు ఏ స్థాయి దాటిపోయాయంటేఅత్యాచారానికి గురైన పిల్లలకు చెందిన తల్లిదండ్రులు వేలసంఖ్యలో కేసు వేశారు. ఆ కేసుల్ని విచారించిన వివిధ దేశాల్లో కోర్టులు బాధిత పిల్లలకు భారీగా నష్టపరిహారం చెల్లించాలని చర్చ్‌ని ఆదేశించాయి. ప్రపంచవ్యాప్తంగా ఇలాంటి భారీనష్టపరిహారాలు చెల్లించుకోవడం కోసం చర్చ్ ఆస్తులు అమ్ముకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది.) కామపిశాచా లైన క్రైస్తవప్రీస్ట్‌ల గురించి ప్రార్థనలు చేయాలని చెప్పిన థెరిసా అబార్షన్లు చేసే డాక్టర్ల కోసం ప్రత్యేక జైళ్లు ఉండాలని కోపం వెళ్ల గక్కారు. (United Press International, 22,October, 1984)

అబార్షన్‌తోపాటు కుటుంబనియంత్రణను కూడా తీవ్రంగా వ్యతిరేకించిన మదర్ థెరిసా భారత్‌లో మాత్రం ఆ విషయాన్ని ఎక్కువగా ప్రస్తావించేవారు కాదు. ఎందుకంటే ఇక్కడ కుటుంబ నియంత్రణను వ్యతిరేకించడమంటే తీవ్రవాదాన్ని ప్రోత్సహించడంతో సమానం. ప్రభుత్వాలు, రాజకీయపార్టీలు కుటుంబనియంత్రణకే ప్రాధాన్యతనిస్తాయి. ఇలా ప్రభుత్వ విధానాన్ని పట్టించుకోకుండా మెక్సికోలో కుటుంబనియంత్రణకు వ్యతిరేకంగా మాట్లాడి థెరిసా చిక్కుల్లోపడ్డారు. ఆగస్ట్, 1982లో అకాపుల్‌కో సదస్సులో జనాభా నియంత్రణకు వ్యతిరేకంగా మాట్లాడినప్పుడు ఇది మెక్సికో రాజ్యాంగ సూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తించడమేనంటూ డియారియో డెల్ పసిఫికో (Diario del pacifico) వంటి స్థానిక పత్రికలు తీవ్రంగా విమర్శించాయి. దీంతో పరిస్థితి ప్రతికూలంగా ఉందని గ్రహించిన థెరిసా అక్కడ నుంచి చల్లగా జారుకున్నారు.

కోల్‌కతాలో ప్రపంచ ప్రఖ్యాతి పొందిన స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్ అనే సంస్థ ఉంది. ఈ పరిశోధనా సంస్థలోనే రోనాల్డ్ రాస్ మలేరియాకు కారణమయ్యే బాక్టీరియాను కనిపెట్టారు. క్షయ, కుష్టు, మలేరియా మొదలైన వ్యాధులతో పాటు ఆహారలేమి, పిల్లల అనారోగ్య సమస్యలకు పరిష్కారం కనుగొనేందుకు ఇక్కడ పరిశోధన జరుగుతుంది. కోల్‌కతా ప్రజానీకానికేకాదు దేశం మొత్తానికి ఉపయోగపడే ఈ పరిశోధనకు ఏనాడూ ఎలాంటి ఆర్థిక సహాయం అందించని థెరిసా ప్రకృతిసిద్ధమైన కుటుంబనియంత్రణ (ఎందుకంటే కృత్రిమ గర్భనిరోధక పద్ధతులకు ఆమె వ్యతిరేకం) గురించి మాత్రం ప్రత్యేకంగా అధ్యయనం జరిపించారు.

అందుకు బాగా ఖర్చు కూడా పెట్టారు. థెరిసా వీరాభిమాని అయిన గైనకాలజిస్ట్ ప్రొ. అజయ్ ఘోష్ ఆధ్వర్యంలో ఈ అధ్యయనం జరిగింది. మురికివాడల్లో నివసించే 17,000మంది మహిళల్లో ప్రకృతి సిద్ధమైన కుటుంబనియంత్రణ పద్ధతి ఎలా పనిచేసిందో పరిశీలించి ఒక రిపోర్ట్ తయారుచేశారు. ఎంతో చదువుకున్న, పరిజ్ఞానం కలిగిన మహిళలే సరిగా తెలుసుకోలేని, ఆచరించలేని ఈ పద్ధతిని నిరక్షరాస్యులైన మురికివాడల్లో మహిళలు తెలుసుకుని, ఉపయోగించగలిగారని చెప్పడంతో రిపోర్ట్‌పై అనేక అనుమానాలు వచ్చాయి. కానీ ఈ తప్పులతడకల రిపోర్ట్‌ను (Journal of Obstetrics and Gynaecology of India , 1982,32; p.443-447) మాత్రం ప్రచురించింది. కృత్రిమ గర్భనిరోధాన్ని వ్యతిరేకించే కాథలిక్ వర్గం ఈ రిపోర్ట్‌నే ప్రస్తావిస్తూ ఉంటారు. అయితే రిపోర్ట్‌లో చెప్పిన మహిళల్లో చాలామంది ఆ తరువాత గర్భం దాల్చారని, అబార్షన్‌లు చేయించుకున్నారని ఎవరికీ తెలియదు. మదర్‌థెరిసా తన జీవితంలో స్పాన్సర్ చేసిన ఏకైక అధ్యయనం ఇదే. ఇలాంటి అవకతవక, ఆచరణ సాధ్యం కాని పద్ధతిని ప్రచారం చేసేందుకు థెరిసా చాలా కష్టపడ్డారు. నోబెల్ బహుమతి స్వీకరణ ఉపన్యాసంలో కూడా సహజ కుటుంబ నియంత్రణ పద్ధతి గురించి ఎంతో గొప్పగా చెప్పారు. 'ఒక్క కలకత్తాలోనే ఆరేళ్లలో 61,273 జననాలను ఈ పద్ధతి ద్వారా అడ్డుకోగలిగాము. అతిసులభమైన, నిరక్షరాస్యులు కూడా తెలుసుకోగలిగిన ఈ పద్ధతి ఎంతో బాగా పనిచే స్తుంది. రోడ్డు పక్కన జీవించే నిరుపేదలు కూడా ఈ పద్ధతి ద్వారా తమకు కావాలనుకున్నప్పుడే పిల్లల్ని కంటున్నారు.' థెరిసా ఇంతగొప్పగా చెప్పిన పద్ధతి ఏమాత్రం సులభంకాదని కాస్త వైద్యపరిజ్ఞానం ఉన్న ఎవరికైనా తెలుస్తుంది. కాళ్ళ చాచుకుని తీరిగ్గా పడుకోడానికైనా వీలులేని గోనెసంచులు కట్టిన గుడిసెలో శరీర ఉష్ణోగ్రతను అతిజాగ్రత్తగా పరిశీలించి,నియంత్రించడం, తద్వారా గర్భం దాల్చకుండా జాగ్రత్తపడడం ఎలా సాధ్యపడిందో థెరిసాకే తెలియాలి. దీన్నిబట్టి థెరిసాకు వీధిబిచ్చగాళ్ళు ఏ పరిస్థితుల్లో జీవిస్తారో కూడా తెలియదనుకోవాలి. లేదా కనీసమైన లోకజ్ఞానం లేదనుకోవాలి. వాడిన సూదులనే మళ్ళీమళ్ళీ ఉపయోగించినా, ఒకే పాలసీసాతో అనేకమంది పిల్లలకు పాలుపట్టినా పట్టించుకోని థెరిసా ప్రకృతిసిద్ధమైన కుటుంబ నియంత్రణను అమలుచేశామని, అందుకు ఫెర్టిలిటీ థర్మామీటర్లు కూడా సరఫరా చేశామని బుకాయిస్తే నిలదీసే నాథుడే లేడు! పోప్, థెరిసా సమర్థించిన సహజ కుటుంబనియంత్రణ పద్ధతి ఎంత అసహజమైనదో, కష్టాలతో కూడుకున్నదో స్వయంగా అనేకమంది కాథలిక్ మహిళలు వెల్లడించారు. ఐర్లాండ్‌కు చెందిన మేరీ ముల్లర్‌నే (Marie Mullarney) ఈ పద్ధతిని పాటించినందువల్ల 11మంది పిల్లలకు తల్లి అయినట్లు చెప్పింది.

ఇలాంటి కష్టమైన, అసహజమైన పద్ధతిని మహిళలపై రుద్దుతున్నందుకు పోప్‌ను తీవ్రంగా విమర్శించింది. (Catholic weekly, The Tablet, 12, September, 1998).

కోల్‌కతాలోకుటుంబనియంత్రణ గురించి గొప్పలు చెప్పుకున్నా, నిజానికి ఆబార్షన్, కుటుంబనియంత్రణ అనే కాథలిక్ మూలసూత్రాలను ఇక్కడ అమలు చేయలేకపోయానని థెరిసా విచారించేవారు. భారతదేశంలో కాథలిక్‌మత వ్యాప్తి తాను కోరుకున్నంతగా సాగడంలేదని వాపోయేవారు. టైమ్ పత్రికకుఇచ్చిన ఇంటర్వ్యూలో థెరిసా తన అసంతృప్తిని, అసహనాన్ని బయటపెట్టారు. 'ఈ దేశంలో(భారత్) మతమార్పిడులు అనుకున్న స్థాయిలో జరగడంలేదని మీరు భావిస్తున్నారా' అని ఎడ్వర్డ్ డెస్మండ్ అనే జర్నలిస్ట్ అడిగిన ప్రశ్నకు మొదట థెరిసా సరిగా సమాధానం చెప్పలేదు. కానీ 'వారు (హిందువులు) కూడా జీసస్‌ను ప్రేమించాలని మీరు అనుకుంటున్నారా' అని మళ్ళీ ప్రశ్నిస్తే 'అవును, వాళ్ళు శాంతిని, సంతోషాన్ని కోరుకుంటే జీసస్‌ను తెలుసుకోవాల్సిందే' అనిసమాధానమిచ్చారు. (Time, 4, December, 1989)

భారతదేశంలో కాథలిక్ మతవ్యాప్తి కోసం రాజకీయ ఆసరా కూడా అవసరమని థెరిసా భావించారు. కాథలిక్ మతానికి అనుకూలంగా ఉన్న పార్టీతో సంబంధాలు ఏర్పరచుకున్నారు. కాంగ్రెస్ పార్టీకి పరోక్షంగా మద్దతునివ్వడమేకాక పార్టీ అధినేత్రి ఇందిరాగాంధీతో సన్నిహితంగా మెలిగారు. ఇందిరాగాంధీ కుమారుడు రాజీవ్‌గాంధీ ఇటలీ కాథలిక్ మహిళ సోనియాను పెళ్ళి చేసుకున్న తరువాత ఈ సాన్నిహిత్యం మరింత పెరిగింది. నవీన్ చావ్లా (భారత ఎన్నికల ప్రధానాధికారిగా పనిచేశారు) థెరిసా, ఇందిరాగాంధీల మధ్య స్నేహానికి వారధిగా పనిచేశారు. ఈయనే ఆ తరువాత థెరిసా అధికారికజీవిత చరిత్ర రాశారు. ఇప్పటికీ మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి చెందిన ఢిల్లీ సెంటర్లలో థెరిసా ఫోటోపక్కనే ఇందిర, రాజీవ్ ఫోటోలు కూడా కనిపిస్తాయి. అధికారం కాపాడుకునేందుకు 1975-77లో అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ దేశంలో ఎమర్జెన్సీ విధించారు. అప్పటివరకు స్వేచ్ఛాయుత ప్రజాస్వామ్య దేశమైన భారత్ ఒక్కసారి నిరంకుశ, నియంతృత్వ పాలనలోకి వెళ్ళిపోయింది. అర్ధరాత్రి అరెస్ట్‌లు, వార్తాపత్రికలు, రేడియో సెన్సారింగ్ మామూలైపోయింది. రాజకీయవర్గంలోనేకాదు దేశంలో ఎవరూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, ప్రతికూలంగా మాట్లాడేందుకు వీలులేని పరిస్థితి. ఆఖరుకుసినీరంగానికి కూడా ఈ నియంతృత్వ నీడ పాకింది. కాంగ్రెస్ పార్టీ ఏర్పాటు చేసిన విరాళాల సేకరణ కార్యక్రమంలో పాల్గనేందుకు నిరాకరించిన ప్రముఖ హిందీ సినీ నేపథ్యగాయకుడు కిషోర్‌కుమార్‌పై నిషేధాజ్ఞలు జారీ

అయ్యాయి. కిషోర్‌కుమార్‌చేత పాటలు పాడించడానికి వీలులేదని అన్ని రికార్డింగ్ కంపెనీలకు ఆదేశాలు వెళ్ళాయి. ఎమర్జెన్సీని తీవ్రంగా వ్యతిరేకించిన జయప్రకాశ్‌నారాయణ్‌పై జైలులో విషప్రయోగం (ఆర్సెనిక్) జరిగిందని, అందువల్లనే ఆయన కిడ్నీలు క్రమంగా పనిచేయడం మానేశాయని అప్పట్లో వార్తలు వచ్చాయి. ఇలాంటి అరాచక పరిస్థితులపట్ల ప్రపంచ వ్యాప్తంగా ఆందోళన, నిరసన వ్యక్తమయితే థెరిసా మాత్రం మరోలా స్పందించారు. 'ప్రజలంతా ఎంతో సంతోషంగా ఉన్నారు. ఎక్కువ ఉద్యోగాలు వస్తున్నాయి. ఎక్కడా సమ్మెలు, ఆందోళనలు లేవు' అని ఎమర్జెన్సీని సమర్థించారు. (Such A Vision of the street, .405). థెరిసా ఎమర్జెన్సీ అనుకూల ప్రకటన కాథలిక్‌లకు కూడా రుచించలేదు.

కాథలిక్ సూత్రాలకు విరుద్ధంగా బలవంతపు కుటుంబనియంత్రణ ఆపరేషన్లు పెద్ద సంఖ్యలో జరుగుతుంటే థెరిసా ఇలాంటి ప్రకటనలు చేయడమేమిటంటూ అమెరికా కాథలిక్ చర్చ్ మండిపడింది. మానవహక్కుల ఉల్లంఘన జరిగిపోతుంటే ఇలా మాట్లాడట మేమిటని ప్రశ్నించింది. ఎమర్జెన్సీ నిరంకుశ పాలన తరువాత వచ్చిన ఎన్నికల్లో చిత్తుగా ఓడించడం ద్వారా ప్రజలు కాంగ్రెస్ పార్టీకి, ఇందిరాగాంధీకి గట్టి గుణపాఠమే నేర్పారు. ఆ ఎన్నికల్లో విజయం సాధిం చిన జనతాపార్టీ ప్రభుత్వాన్ని ఏర్పరచింది. మొరార్జీదేశాయ్ ప్రధానిగా బాధ్యతలు చేపట్టారు. ఇందిరాగాంధీ అంటే ఎంతోఇష్టపడే థెరిసాకి మొరార్జీ ప్రధాని కావడం అంత రుచించలేదు. పైగా విచ్చలవిడి మతమార్పిడులు, మత ప్రచారానికి పాల్పడుతున్న క్రైస్తవ మిషనరీలపై ఆంక్షలు విధించడం ఆమెకు మరింత కోపం తెప్పించింది. తన నిరసన వ్యక్తం చేస్తూ ప్రధానికి ఘాటైన (ఎంత ఘాటైనదంటే ఒక ప్రధానికి ఇంత ధైర్యంగా ఉత్తరం రాసినవారెవరూ లేరని కాథలిక్ వర్గాలు ఇప్పటికీ మురిసిపోతుంటాయి) లేఖ రాశారు. అందులో ఒక పేరా కనీస మర్యాదను కూడా అతిక్రమించినట్లుగాఉంది. ఆ పేరాలో మొరార్జీ వయస్సును (అప్పటికి 82 ఏళ్లు) ప్రస్తావించిన థెరిసా 'మీకు దేవుడంటే భయమూ, భక్తి లేవా? మిస్టర్ దేశాయ్, మీరు దేవుడిని కలుసుకునే రోజు (చనిపోయేరోజు) అతి దగ్గరలోనే ఉంది. అక్కడ ఏం సమాధానం చెప్పుకుంటారు?....' అని రాశారు. ఒక దేశ ప్రధానికి ఎవరైనా ఇలాంటి ఉత్తరం రాయగలరా?!

థెరిసా రాజకీయ ఆసక్తి అబార్షన్లు, కుటుంబనియంత్రణ వ్యతిరేకతతోనే ఆగిపోలేదు. దళిత క్రైస్తవులకు కూడా రిజర్వేషన్లు కల్పించాలన్న డిమాండ్‌కు ఆమె పూర్తి మద్దతునిచ్చారు. అయితే అమానుషమైన హిందూ కులవ్యవస్థలో అణగారి పోతున్నారంటూ దళితులను మతం మార్చి, క్రైస్తవంలో కులాలే లేవని, ఉచ్చనీచ భేదాలు అసలే లేవని చెప్పుకుంటూ దళిత క్రైస్తవులకు రిజర్వేషన్లు కోరడం ఏమిటని

పలువురు అడిగిన ప్రశ్నకు ఆమె ఏనాడూ సమాధానం చెప్పలేదు. 1995 నవంబరులో క్రైస్తవ సంస్థలన్నీ కలిసి దళిత క్రైస్తవులకు రిజర్వేషన్లు కల్పించాలంటూ భారీ ప్రదర్శనలు చేశాయి. అప్పటివరకు తెరవెనుక నుంచే మద్దతు తెలుపుతున్న థెరిసా ప్రత్యక్షంగా ప్రదర్శనల్లో పాల్గొనాలని నిర్ణయిం చుకున్నారు. ఈ వార్త విన్న క్రైస్తవ వర్గాల్లో ఆనందం వెల్లివిరిసింది. థెరిసావంటి అంతర్జాతీయ ప్రముఖురాలు ప్రదర్శనల్లో పాల్గంటే ప్రభుత్వం దిగివచ్చి రిజర్వేషన్లు ఇచ్చేస్తుందని భావించారు. అనుకున్నట్లుగానే థెరిసా 18 నవంబర్ ఢిల్లీలో జరిగిన ఒకరోజు నిరాహార దీక్షలో పాల్గొన్నారు. థెరిసా దీక్షలో పాల్గనడం క్రైస్తవ వర్గాలకు సంతోషం కలిగించినా ఆమె కులరాజకీయాలకు పాల్పడుతున్నారంటూ సర్వత్రా విమర్శలు రేగాయి. ఎప్పుడూ ఆమె వెన్నంటి ఉండి, ఆమెకుఒక అంతర్జాతీయ గుర్తింపు కల్పించిన వార్తాపత్రికలు కూడా విమర్శించడం మొదలుపెట్టాయి. వేర్పాటువాద, మత తత్వధోరణి ప్రదర్శిస్తున్నారని ముస్లిములను విమర్శిస్తున్నప్పుడు థెరిసాపై కూడా అలాంటి ఆరోపణలే చేయాల్సివస్తుంది కదా అంటూ కోల్‌కతాకు చెందిన స్టేట్స్‌మన్ పత్రిక ప్రశ్నించింది. కులమనే కళంకాన్ని ప్రపంచం మీద రుద్దిదం టూ హిందుత్వాన్ని తిట్టిపోసినవారికి, కుల వివక్షకు గురవుతున్నారని నిమ్నకులాలవారిని మతం మారుస్తున్నవారికి కులం, దాని ఆధారంగా ఏర్పడిన రిజర్వేషన్లు ఎందుకు కావల్సివచ్చాయి అని ప్రతిపక్షాలు ప్రశ్నించాయి. అన్నివైపుల నుంచి వెల్లువలా వచ్చిన విమర్శలకు కంగుతిన్న థెరిసా వెంటనే మాటమార్చారు. నవంబరు 24న అర్జంటుగా కోల్‌కతా మదర్‌హౌస్‌లో పత్రికా సమావేశం నిర్వహించి ఢిల్లీ ధర్నా ఎందుకు జరిగిందో తనకు తెలియదని, అదేదో ప్రార్థనా సమావేశమనుకుని వెళ్ళి కూర్చున్నానని అమాయకత్వం ప్రకటించారు. 'నేను ఏనాడూ దళిత క్రైస్తవులకు రిజ ర్వేషన్లు డిమాండ్ చేయలేదు. అలాగే ఎప్పుడూ ఇలాంటి దీక్షలు, ధర్నాల్లో పాల్గనలేదు' (Asian Age, London, 25, November, 1995) అని ప్రకటించారు.

ఏ రాజకీయ నాయకుడు ఇంతకంటే ఎక్కువ అవకాశవాదాన్ని ప్రదర్శించలేడు. అయితే అక్కడితో ఆ విషయం అయిపోలేదు. థెరిసా దీక్షలో పాల్గనడంపై ఎంతో సంతోషించిన క్రైస్తవ వర్గాలకు ఆమె మాటమార్చడం ఏమాత్రం రుచించ లేదు. ధర్నా నిర్వహించిన బిషప్ విన్సెంట్ కాన్‌సెసావో (Bishop Vincent Consessao) తమ అసంతృప్తిని బహిరంగంగానే బయటపెట్టారు. 'ఆమెను ఆహ్వానించినపుడు, ధర్నా ఎందుకు జరుగుతోందో చెప్పి కార్యక్రమ వివ రాలు కూడా ఇచ్చాం. ఆమె సరిగా అర్థం చేసుకున్నట్లు లేరు' అన్నారు. బహుశ తనకు

దగ్గరైన, అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీని ఇబ్బందిపెట్టడం ఇష్టంలేక థెరిసా హఠాత్తుగా మాటమార్చిఉంటారు. లేదా క్రైస్తవేతరుల్లో తనకు ఉన్న 'సెక్యులర్' గుర్తింపు పాడైపోతుందని భయపడి ఉంటారు.

మత, రాజకీయ ప్రయోజనాల కోసం ఎలాంటి పద్ధతినైనా అనుసరించేందుకు సిద్ధపడ్డ థెరిసా 1960,70 దశకాల్లో ఓటుహక్కు కూడా వినియోగించుకునేవారు. అప్పటికే కాంగ్రెస్ పార్టీతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకున్న ఆమె ఎవరికిఓటు వేసేవారో ఊహించడం కష్టమేమీకాదు. అయితే ఒకసారి ఓటు వేయడానికి వెళ్ళినప్పుడు ఒక మార్క్సిస్టు 'సన్యాసికిరాజకీయాలు, ఓట్లు ఎందుకో' అని వ్యాఖ్యానించాడని, అప్పటి నుంచి ఓటు వేయడం మానుకున్నారని థెరిసా జీవిత చరిత్ర రాసిన ఈగన్ వెల్లడించాడు. తాను ఓటు వేయడం మానుకున్నారు కానీ తన సంస్థకు చెందిన సిస్టర్స్, బ్రదర్స్ తప్పకుండా ఓటు వేసేట్లు చూసేవారు. కొందరు నన్స్ పేర్లు ఓటర్లు జాబితాలో లేకపోవడంపై 1991లో బెంగాల్ ఎలక్షన్ కమిషనర్‌కి ఉత్తరం రాశారు. (Prbashi Anandabazaar, Calcutta, 4, October, 1997). ఓటు వేయడం కోసం పొడవైన క్యూలు కట్టిన నన్‌ల ఫోటోను ది యూనివర్స్ (The Universe, 8, March, 1998) ప్రచురించింది. అయితే ఎవరికి ఓటు వేయాలో వీరందరికీ 'పై నుంచి' ఆదేశాలు వచ్చేవి. అన్ని విషయాల్లో మాదిరిగానే ఇందులోనూ నన్స్ పైవారి ఆదేశాలు పాటించాల్సిందే. పై నుంచి ఎలాంటి ఆదేశాలు వచ్చేవో ఊహించడం అంత కష్టమేమీ కాదు. ఇవీ మదర్ థెరిసా నడిపిన మతరాజకీయాలు.



అధ్యాయం - 6

# ఇదీ సేవంటే!

యేసుకు అతి ప్రియమైన నిరుపేదల సేవ చేస్తున్నానంటూ దేశవిదేశాల్లో అపారమైన విరాళాలు దండుకున్న మదర్ థెరిసా సంస్థ మిషనరీస్ ఆఫ్ ఛారిటీ అలాంటి సేవలు ఎక్కడా చేయనేలేదు. సేకరించిన విరాళాల్లో ఎక్కువశాతం నన్స్, బ్రదర్స్‌ల మతశిక్షణకు, వారు నివాసముండే మఠాలకే ఖర్చయ్యేది. మరికొన్ని నిధుల్ని వాటికన్‌కు తరలించే వారు. ఇక కోల్‌కతా సెంటర్లలో పనులన్నీ విదేశీవాలంటీర్లు (ఉచితంగా) చేసిపెట్టేసేవారు. 'దమ్మిడీ ఖర్చులేదు దండు కున్నంత విరాళాలు' -అన్నట్లుగా సాగింది సేవా వ్యాపారం. ఇది చూసి విదేశీ వాలంటీర్లే విస్తుపోయేవారు. కోల్‌కతాలో థెరిసా చేస్తున్న సేవలో పాలుపంచుకోవాలని ఆసక్తిగా వచ్చిన లండన్ డాక్టర్ రిచర్డ్ డీన్ ఆ తరువాత ఆసలు సంగతి గ్రహించాడు. కోట్ల డాలర్ల నిధులున్న ఛారిటీ సంస్థ నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలకంటే సరైన నిధులు లేకపోయినా అనేక హిందూ స్వచ్ఛంద సంస్థలు చేస్తున్న పనులే ఎంతో బాగున్నాయని డీన్ చెప్పాడు. స్వామి వివేకానంద స్థాపించినరామకృష్ణామిషన్, భారత సేవాశ్రమ్ సంఘ మొదలైన సంస్థలు నిర్వహించిన, నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలకి, మిషనరీస్ ఆఫ్ ఛారిటీ చేసే సేవలకి అసలు పోలికే లేదని తెలుస్తుంది. ప్రాథమిక విద్యారంగం, ప్రకృతి విపత్తులు సంభ వించినప్పుడు సహాయం అందించే విషయాల్లో ఛారిటీ పంస్థ చేసినది ఏమీ లేదనే చెప్పాలి. ఉ దాహరణకు 1997 తరువాత దేశంలో సంభవించిన రెండు ప్రకృతి విపత్తులను తీసుకోవచ్చు. 1999 ఒరిస్సాలో వచ్చిన వరదలు, 2001 గుజరాత్ భూకంపం అపారమైన నష్టం కలిగించాయి. ఒరిస్సా వరదల్లో దాదాపు ఎనిమిదివేలమంది చనిపోయారు. లక్షలాది మంది నిరాశ్రయులయ్యారు. అప్పుడు మిషనరీస్ ఆఫ్ ఛారిటీ చేసిన సహాయం ఏమిటంటే పారదీప్‌లో ఒక చిన్న గంజి కేంద్రం నడపడం. ఇక 2001 గుజరాత్ భూకంపంలో 20,000మంది చనిపోయారు. లక్షలాది మంది ఇళ్ళువాకిళ్ళు కోల్పోయారు. ఒరిస్సా వరదల్లో కనీసం గంజికేంద్రమైనా నడిపిన ఛారిటీ సంస్థ గుజరాత్ బాధితులను అసలు పట్టించుకోలేదు. ఇవేకాదు భోపాల్ గ్యాస్ దుర్ఘటన, పశ్చిమబెంగాల్ వరదల సమయంలోనూ నన్స్ నిమ్మకునీరెత్తినట్లే

ఉండిపోయారుతప్ప సహాయం చేసేందుకు ముందుకు రాలేదు. గ్యాస్ దుర్ఘటనలో బాధితులకు సహాయం అందించకపోగా అంతటి విపత్తుకు కారణమైన అమెరికా సంస్థ యూనియన్ కార్బైడ్‌ను 'క్షమించేయాలంటూ' థెరిసా సలహా ఇచ్చారు! విపత్తులు ఎదురైనప్పుడు హిందూ సంస్థలు, మిషనరీస్ ఆఫ్ ఛారిటీ ఎలా ప్రతిస్పందించాయో చూద్దాం. 1993-94లో దేశంలో సంభవించిన ప్రకృతి వైపరీత్యాల్లో రామకృష్ణామిషన్, థెరిసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ నిర్వహించిన సహాయ కార్యక్ర మాలు పరిశీలిద్దాం-

| విపత్తు | సహాయం అందించిన సంస్థ | |
|---|---|---|
| | రామకృష్ణా మిషన్ | మిషనరీస్ ఆఫ్ ఛారిటీ |
| బీహార్ కరవు | అవును | లేదు |
| గుజరాత్ కరవు | అవును | లేదు |
| వరదలు | | |
| పశ్చిమబెంగాల్ | అవును | లేదు |
| తమిళనాడు | అవును | లేదు |
| పాండిచ్చేరి | అవును | లేదు |
| గుజరాత్ | అవును | లేదు |
| భూకంపం | | |
| లాతూర్ | అవును | లేదు |

ప్రపంచంలోనే అతిపెద్ద ప్రకృతి విపత్తుల్లో ఒకటైన లాతూర్ భూకంపం వచ్చిన తరువాత రామకృష్ణామిషన్ కొన్నేళ్ళపాటు సహాయ కార్యక్రమాలు నిర్వహిస్తే మిషనరీస్ ఆప్ ఛారిటీ ఆ చాయలకే వెళ్లలేదు. లాతూర్‌లో మొత్తం భూకంపాలను తట్టుకోగలిగిన 500పైగా ఇళ్ళను నిర్మించి బాధితులకు అందజేసింది రామకృష్ణామిషన్.

పేదలకు ఇళ్ళు కట్టించి ఇచ్చే కార్యక్రమాన్ని ఏనాడూ చేపట్టని మిషనరీస్ ఆఫ్ ఛారిటీ 1990లో కోల్‌కతా శివార్లలో 48 ఇళ్లు కట్టింది. హత్‌గచియా ప్రాంతంలో ప్రభుత్వ బంజరు భూమిలో ఈ ఇళ్ళు కట్టారు. అనుమతి లేకుండా ఇళ్ళు కట్టినందుకు మున్సిపల్ కార్పొరేషన్ నోటీసులు కూడా పంపింది. ఈ వివాదం

చాలాకాలమే సాగినా థెరిసా అంతర్జాతీయ ఇమేజ్ ముందు మున్సిపల్ కార్పొరేషన్ తలవంచకతప్పలేదు. స్థలాన్ని వదులుకుంది. అలా ఉచితంగా కొట్టేసిన స్థలంలో కట్టిన ఇళ్లను కాథలిక్ మతస్థులకే కేటాయించారు. నిజానికి కోల్‌కతా నగరంలో కాథలిక్ జనాభా 1.5 శాతం కంటే తక్కువే. అంత తక్కువ సంఖ్యలో ఉన్నా, కట్టించిన ఇళ్ళలో ఒక్కటి కూడా క్రైస్తవేతరులకు కేటాయించలేదు. అన్ని ఇళ్ళు క్రైస్తవులకే ఇచ్చారు. థెరిసా సేవాకార్యక్రమాలు చేపట్టడమే అరుదని, చేపట్టిన కొద్ది సేవలు క్రైస్తవుల కోసమేనని చెప్పడానికి ఇది ఉదాహరణ. కోల్‌కతాలో రామకృష్ణమిషన్, మిషనరీస్ ఆఫ్ ఛారిటీ నిర్వహిస్తున్న సెంటర్ల వివరాలు చూద్దాం.

| | రామకృష్ణమిషన్ | మిషనరీస్ ఆఫ్ ఛారిటీ |
|---|---|---|
| హాస్‌పైస్ (మరణాసన్న రోగుల సంరక్షణ కేంద్రం) | లేదు | ఉంది |
| అనాథాశ్రమం | ఉంది | ఉంది |
| మానసిక రోగుల సంరక్షణ కేంద్రం | లేదు | ఉంది |
| కుష్టు వ్యాధిగ్రస్తుల సంరక్షణ కేంద్రం | లేదు | ఉంది |
| ఆసుపత్రి | ఉంది | లేదు |
| నర్సింగ్ స్కూలు | ఉంది | లేదు |
| కమ్యూనిటీ హెల్త్ సర్వీస్ | ఉంది | లేదు |
| ప్రాథమిక చికిత్స కేంద్రం | ఉంది | ఉంది |
| | (సంవత్సరానికి 1,00,000మందికి వైద్యం) | (10,000 మందికి వైద్యం) |
| వికలాంగులకు ప్రత్యేక పాఠశాల | ఉంది | లేదు |
| స్కూళ్లు | ఉన్నాయి(3) | లేవు |
| గ్రామీణ దత్తత కార్యక్రమం | ఉంది | లేదు |
| మురికివాడల అభివృద్ధి కార్యక్రమం | ఉంది | లేదు |
| వయోజన విద్యా కేంద్రం | ఉంది | లేదు |
| గ్రంథాలయాలు | ఉన్నాయి(పది) | లేవు |
| పర్యావరణ పరిరక్షణ ప్రాజెక్ట్ | ఉంది | లేదు |

గ్రామాల దత్తత పథకం కింద 20 గ్రామాల చొప్పున కొన్నేళ్లపాటు దత్తత తీసుకునే రామకృష్ణమిషన్ ఆ గ్రామాల్లో విద్య,వైద్యంతోపాటు కనీస సదుపాయాలు పెంపొందిస్తుంది. అలాగే గ్రామీణ యువతకు వృత్తివిద్యలో శిక్షణనిస్తుంది. కుటుంబ నియంత్రణపట్ల అవగాహన కలిగించడం కూడా ఈ కార్యక్రమంలో భాగమే. 1997 నాటికి ఇలా 9,000 గ్రామాల్లో సదుపాయాలు కల్పించారు. ఈ పథకాన్ని చక్కగా అమలు చేయడానికి రామకృష్ణ మిషన్ లోక్‌శిక్షా పరిషత్ అనే విభాగాన్ని ఏర్పాటు చేసింది.

కాథలిక్ మత ప్రచారం ప్రధాన లక్ష్యంగా పనిచేసిన థెరిసా సంస్థ మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి రామకృష్ణమిషన్ కార్యకలాపాలంటే సహజంగానే వ్యతిరేకత ఉంటుంది. దేశంలో సాగుతున్న మతమార్పిడులను అడ్డుకోవాలన్నది కూడా రామకృష్ణ మిషన్‌కు ప్రారంభించడంలో స్వామి వివేకానంద ఉద్దేశ్యం. ముఖ్యంగా గిరిజన జాతుల్ని మతం మార్చడంలో ప్రత్యేక ఉత్సాహం చూపే థెరిసా సంస్థకు రామకృష్ణమిషనంటే వ్యతిరేకత. మదర్ థెరిసా సెంటర్లను చూడటానికి ప్రత్యేకంగా కోల్‌కతాకు వచ్చిన పోప్, అక్కడ క్రైస్తవ మతం పుచ్చుకున్న గిరిజనులను ఉద్దేశించి మాట్లాడారు. వనవాసులను మాయచేసి, ప్రలోభపెట్టి మతం మార్చడమే తప్ప ఛారిటీవంటి క్రైస్తవ సంస్థలు ఏనాడూ వారి బాగోగుల గురించి పట్టించుకోలేదు. మరోవైపు అరుణాచల్ వంటి ప్రాంతంలో రామకృష్ణమిషన్ 160 పడకల అత్యాధునిక ఆసుపత్రిని నడుపుతోంది.

అద్భుతమైన తన సేవా కార్యక్రమాలకు కోల్‌కతా కేంద్రమని చెప్పుకున్న థెరిసా నిజానికి అక్కడా ఒరగబెట్టినదేమీలేదు. కోల్‌కతా చుట్టుపక్కల ప్రాంతాలు అనేకసార్లు వరదతాకిడికి గురైనప్పుడు హిందూ సంస్థలు అందించిన సహాయంతో పోలిస్తే ఛారిటీ సంస్థ చేసింది అంతంతమాత్రమే.

1978లో కోల్‌కతా చుట్టుపక్కల ప్రాంతాలన్నీ వరదల్లో చిక్కుకున్నప్పుడు ఒక్క హూగ్లీ జిల్లాలోనే రామకృష్ణమిషన్ రోజుకి 12,000మందికి ఆహారం అందిస్తే మిషనరీస్ ఆఫ్ ఛారిటీ 300 మందికి మాత్రమే ఆహారం సమకూర్చింది. సహాయకార్యక్రమాల్లో పాల్గనేందుకు రామకృష్ణమిషన్‌కు చెందిన వివిధ స్కూలు విద్యార్థులు ముందుకు వచ్చారు. వారంతా మారుమూల గ్రామాలకు కూడా వెళ్ళి

సహాయం అందించారు. కానీ రోజులో ఎక్కువభాగం ప్రార్థనలకే పరిమితమై, ఎప్పుడూ సౌకర్యవంతమైన భవనాల్లోనే గడపడానికి అలవాటుపడిన నన్స్‌కు వరదప్రాంతాల్లో, అనిశ్చిత పరిస్థితుల్లో పనిచేయడం సాధ్యం కాలేదు. పైగా భాషా సమస్య ఒకటి. నన్స్‌కు బైబిల్ చదువుకునే ఇంగ్లీషు వస్తుందా? రాదా? అని పట్టించుకున్న థెరిసా వారికి స్థానికుల భాష(బెంగాలీ) వస్తుందాలేదా అని ఎప్పుడూ విచారించలేదు. 1977 నవంబరు 19న ఆంధ్రప్రదేశ్ దివిసీమలో వచ్చిన భయంకర ఉప్పెన సమయంలోనూ మిషనరీస్ ఆఫ్ చారిటీ ఏ సహాయం అందించ లేక పోయింది. అదే సమయంలో రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ స్వయంసేవకులు అపూర్వమైన సేవా కార్యక్రమాలు నిర్వహించారు. ఉప్పెనలో 15,000మంది చనిపోయారు. లక్షలాదిమంది నిరాశ్రయు లయ్యారు. ఆర్ఎస్ఎస్ స్వయం సేవకులు వందలాది శవాలను తొలగించి అంత్యక్రియ జరిపారు. అలాంటి దారుణ పరిస్థితుల్లో ఛారిటీ నామమాత్రపు సహాయ కార్యక్రమాన్ని పర్యవేక్షించేందుకు స్వయంగా వచ్చిన మదర్ థెరిసా ఆ పరిస్థితులకు తట్టుకోలేక అనారోగ్యం పాలయ్యారు. దివిసీమలో థెరిసా పర్యటన గురించి ఆమె జీవిత చరిత్రలో ఇలా రాశారు- 'సహాయ కార్యక్రమాల్లో పాల్గొనేందుకు థెరిసా, ఆమె సిస్టర్స్ వచ్చారు. ఎటు చూసినా వందల సంఖ్యలో శవాలు గుట్టలుగుట్టలుగా కనిపించాయి. శవాలకు దహన సంస్కారం జరుగుతుంటే థెరిసా మోకాళ్లపై కూర్చుని ప్రార్థనలు చేశారు. అక్కడ తిరగడంతో అనారోగ్యంపాలైన థెరిసా 'నాకు మలేరియా జ్వరం వచ్చింది. ఆంధ్రప్రదేశ్ నాకు ఇచ్చిన బహుమతి ఇదీ' అని అన్నారు. (Eileen Egan, Such A Vision of the street, Sidgwick & Jackson,1985,p.320)

వరదల్లో ఇళ్లు కోల్పోయినవారికి ఆర్ఎస్ఎస్ దీన్‌దయాళ్‌పురం, రామకృష్ణ మిషన్ రామకృష్ణాపురం అనే కాలనీలు నిర్మించాయి.

విచిత్రమేమిటంటే హిందూసంస్థలు ఇంత పెద్ద ఎత్తున బాధితులను ఆదుకుంటే ఏమీ చేయని, చేయలేని మిషనరీస్ ఆఫ్ ఛారిటీకి అంతర్జాతీయ స్థాయిలో ప్రచారం లభించింది. ఆ ప్రచార ప్రభావంవల్ల థెరిసాకు నోబెల్ శాంతి బహుమతివచ్చింది. భారత ప్రభుత్వం ఏకంగా భారతరత్న బిరుదు ఇచ్చింది.

పేదలు, బాధితుల కోసం సేవ చేశానంటూ విపరీతమైన ప్రచారం చేసుకున్న మదర్ థెరిసాకు నోబెల్‌ప్రైజ్, భారతరత్నవచ్చాయోమోకాని పేదలకు ఒరిగినదేమీలేదు. ఎటువంటి ఆర్భాటం లేకుండా సేవా కార్యక్రమాలు నిర్వహించిన, నిర్వహిస్తున్న ఆర్‌ఎస్‌ఎస్, రామకృష్ణమిషన్, మాతా అమృతానంతమయిట్రస్ట్, సత్యసాయి సంస్థలకు మాత్రం మన మీడియా ఎలాంటి ప్రచారం కల్పించదు, పట్టించుకోదు. మాతా అమృతానందమయి, మదర్ థెరిసా - ఇద్దరూ మహిళలే. అయితే థెరిసా సేవ పేరుతో మతరాజకీయాలు నడిపితే, మాతా అమృతానందమయి ఆధ్యాత్మికత ఆధారంగాఅందరినీ అక్కున చేర్చుకున్నారు. కాన్సర్, తదితర ప్రాణాంతకమైన రోగాలతో బాధపడేవారికి సంరక్షణ కేంద్రాలు (హౌస్‌పైస్) తామే నడుపుతున్నామంటూ థెరిసా గొప్పలు చెప్పుకున్నారు. కానీ అమృతానందమయి ట్రస్ట్ ఆధ్వర్యంలో ముంబైలో హౌస్‌పైస్ నిర్వహిస్తున్నారని చాలామందికి తెలియదు. అలాగే ఏనాడూ, ఎవరికీ ఇళ్ళు కట్టించి ఇవ్వడం ఛారిటీ సంస్థకు తెలియదు. కట్టిన కొన్ని ఇళ్లను కూడా కాథలిక్ మతస్థులకే కేటాయించిన మతదృష్టి ఆ సంస్థది. కానీ అమృతానందమయి సంస్థ సునామీ బాధితుల కోసం లక్ష ఇళు కట్టించే బృహత్తర ప్రాజెక్ట్ చేపట్టింది. ఆ ఇళ్ల పట్టాలు అందుకున్న వారిలో క్రైస్తవులు కూడా ఉన్నారు.

పుట్టపర్తి సత్యసాయిబాబా ఆశీస్సులతో సత్యసాయి ట్రస్ట్ ప్రారంభించిన సేవా కార్యక్రమాలు కూడా ప్రజల్ని ఆదుకున్నాయి. 500 కోట్ల రూపాయలతో సత్యసాయి పథకం కింద ప్రారంభించిన మంచినీటి సరఫరా పథకం వీటిలో ఒకటి. ఫ్లోరైడ్ నీటితో బాధలు పడుతున్న అనంతపురం జిల్లాలోని 1447 గ్రామాలకు సురక్షితమైన మంచినీరు అందిస్తున్నారు. ఇందుకు 3,200 కిలోమీటర్ల పొడవున పైప్‌లైన్లు వేశారు. మంచినీటితో దాహం తీర్చిన సత్యసాయి అత్యాధునిక సూపర్‌స్పెషాలిటీఆస్పత్రి ద్వారా లక్షలాదిమందికి ఉచితంగా వైద్యం అందించే ఏర్పాటు చేశారు. పుట్టపుర్తిలోని సూపర్‌స్పెషాలిటీ ఆస్పత్రి300 కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మించారు. ఇందులో 8 ఆపరేషన్ థియేటర్లు ఉన్నాయి. ఇక్కడ గుండె, కంటి జబ్బులకు ఉచితంగా శస్త్రచికిత్సలు చేస్తారు. ఇప్పటివరకు ఇక్కడ 22 లక్షల మంది వైద్యసేవలు అందుకున్నారు. 12 లక్షలమంది శస్త్ర చికిత్సలు

చేయించుకున్నారు. అలాగే బెంగళూరులోని సత్యసాయి సూపర్‌స్పెషాలిటీ ఆస్పత్రిలోనూ ఉచితంగా వైద్యం అందిస్తున్నారు. 306 పడకలు కలిగిన ఈ ఆస్పత్రిని 500 కోట్ల రూపాయలతో కట్టారు. ఇక్కడ గుండె, మెదడుకు సంబంధించిన ఆపరేషన్లు ఉచితంగా చేస్తారు. బెంగళూరులోనే మహిళలు, పిల్లలకోసం 50 పడకల ఆస్పత్రి ఏర్పాటుచేశారు. ఇవికాక గ్రామీణప్రాంత ప్రజలకోసం సంచారవైద్యశాల ఉంది. వైద్యంతోపాటు నిరుపేద లకు అన్నవస్త్రాలు కూడా అందిస్తున్నారు. పుట్టపర్తి, బుక్కపట్నం, కొత్తచెర్వు ప్రాంతాల్లోని వందగ్రామాల్లో ఇంటింటికీ అన్నవస్త్రాలు పంపిణీ చేస్తున్నారు. అలాగే అనాథబాలలకు ఆశ్రయం కల్పించడం కోసం పుట్టపర్తిలో వసతిగృహంతో పాటు పాఠశాలను ఏర్పాటుచేశారు. ప్రతి పిల్లవాడి పేరున లక్షరూపాయలు డిపాజిట్ చేశారు. సత్యసాయి సేవాట్రస్ట్ ప్రకృతి విపత్తుల సమయంలోనూ ప్రజల్ని ఆదుకుంది. 2008 ఒరిస్సా వరదల్లో ఆశ్రయం కోల్పోయిన వారికి ఉచితంగాఇళ్లు కట్టించిఇచ్చారు. నాలుగు జిల్లాల్లో 750 ఇళ్లు కట్టారు. ఒక్కో ఇంటికి లక్ష రూపాయలు అందించారు. సేవాకార్యక్రమాలతోపాటు పిల్లలను ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దేందుకు అనేక విద్యాలయాలు ప్రారంభించారు. ఒక్క సత్యసాయి ఇన్ని కార్యక్రమాల ద్వారా కొన్ని లక్షలమందిని ఆదుకున్నారు.

హిందూధర్మ విలువల ఆధారంగా సేవా పరమో ధర్మః అనే ఉన్నత లక్ష్యంతో పనిచేస్తున్న సంస్థలన్నీ ఎలాంటి తరతమభేదాలు లేకుండా సమాజంలో అందరినీ ఆదుకుంటున్నాయి. కానీ సేవ పేరుతో కోట్ల డాలర్లు దండుకున్న మిషనరీస్ ఆఫ్ ఛారిటీ క్రైస్తవ మత రాజకీయాలకే పరిమితమయింది.



# ముగింపు

సోదరి నివేదిత, మదర్ థెరిసా - ఇద్దరూ కోల్‌కతా కేంద్రంగానే పనిచేశారు. సుఖవంతమైన జీవితాన్ని వదులుకుని స్వామి వివేకానంద శిష్యురాలిగా ఇక్కడ అడుగుపెట్టిన నివేదిత భారతీయ సంస్కృతిని, ప్రజానీకాన్ని గౌరవించి. అభిమానించింది. ఇక్కడ ప్రజలకు సేవ చేసేందుకు సిద్ధపడింది. ముఖ్యంగా ఆడపిల్లలకు చదువు చెప్పడానికి ఎన్నో పాఠశాలలు తెరిచింది. నివేదిత చేసిన కృషికి బెంగాలీలేకాదు భారతీయులంతా ఎంతగా ముగ్ధులయ్యా రంటే ఇప్పటికీ ఆడపిల్ల లకు ఆమె పేరుపెట్టుకుంటారు. కానీ విచిత్రమేమిటంటే ఆమె పుట్టిన ఐర్లాండ్‌లో ఈ పేరుప్రతిష్టలు కనిపించవు. సేవాస్వరూపిణిగా అంతర్జాతీయ గుర్తింపు రాలేదు. నోబెల్, భారతరత్నలు అసలే రాలేదు. మరోవైపు అల్బేనియాకు చెందిన మదర్ థెరిసా స్థానిక క్రైస్తవ వర్గాల మధ్య పోరుజోరుగా సాగుతున్నప్పుడు అక్కడ నుంచి కోల్‌కతా వచ్చారు. కాథలిక్ మతకార్యకర్తగానే పని ప్రారంభించారు. కొన్ని సెంటర్లు పెట్టారు. తరుచు వాటికన్ వెళ్ళి పోప్ ఆశీస్సులు తీసుకోవడం, విదేశీ పర్యటనల్లో బిజీగా గడపడంతప్ప నిజంగా అవసరం వచ్చినప్పుడు ఇక్కడి ప్రజలకి సేవ చేసిందేమీ లేదు. పైగా భారతీయ సంస్కృతి, మతం అంటే గౌరవభావం లేని థెరిసా మత మార్పిడులను ప్రోత్సహించారు. ఇలా సేవ పేరుతో మతప్రచారం సాగించిన మదర్ థెరిసాకు ప్రపంచమంతటా ప్రచారం, డబ్బు లభించాయి. నోబెల్ బహుమతితోపాటు భారతరత్న వరించింది. విదేశాల్లో సంపన్నులు అడగకుండానే నిధులు ఇచ్చారు. అంతర్జాతీయ క్రైస్తవ మీడియా థెరిసాచేయని సేవను కూడా గొప్పగా ప్రచారం చేసింది. సోదరి నివేదిత, మదర్ థెరిసాలు ఇద్దరూ విదేశస్థులే. ఇద్దరూ క్రైస్తవ మతంలో పుట్టినవారే. ఇద్దరూ ఇక్కడికి వచ్చి పని చేసినవారే. అయినా వాళ్ళు చేసిన పనిలో ఎంతో తేడా. వారికి వచ్చినగుర్తింపులో మరెంతో వ్యత్యాసం.

బాబా ఆమ్టే కుష్టురోగుల సంరక్షణ కోసం 2000 ఎకరాలలో అన్ని సదుపాయాలున్న గ్రామాన్నే ఏర్పాటుచేశారు. ఇంత పెద్దఎత్తున సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నా విదేశీ (క్రైస్తవ) మీడియా ఏమాత్రం గుర్తించదు. ఆ విదేశీ మీడియా అడుగుజాడల్లో నడిచే మన మీడియా కూడా వారిని పట్టించుకోదు. గుర్తింపు రావాలంటే విదేశీయులు, క్రైస్తవ మతస్తు లు అయి ఉండాలి. హిందూమత వ్యతిరేకి అయిన ఉండటం అదనపు అర్హత. సేవ పేరుచెప్పుకుని విరాళాలు

పొగిడుకోవడంతప్ప చేసినదేమీలేదని తెలిసినా చాలామంది విదేశస్థులు, భారతీయులు కూడా థెరిసానే నెత్తిన పెట్టుకోడానికి రెండు కుంటిసాకులు చెపుతారు. ఒకటి, చెప్పినంతకాకపోయినా ఆమె ఏదో కొంతైనా చేస్తోంది కదా 2) ఇతర సంస్థలుఆమెకంటే ఎక్కువగా చేస్తున్నాయనుకున్నా అసలు సేవాకార్యక్రమాలను ప్రారంభించింది థెరిసాయే కదా. కానీ ఈ రెండు అభిప్రాయాలు ఏర్పడటానికి పథకం ప్రకారం, నిరంతరంగా క్రైస్తవ మీడియా, థెరిసా చేసిన ప్రచారమే కారణ మని చాలామంది గుర్తించరు.

ఏమీ చేయకుండా ఎంతో చేస్తున్నట్లు ప్రచారం చేసుకునేందుకు, తాము సాగిస్తున్న మత కార్యకలాపాలు బయటపడకుండా ఉండేందుకు థెరిసా అనేక పద్ధతులు అనుసరించేవారు. దేవునికి ప్రియమైన నిరుపేదలు ఎప్పుడూ అక్కడే, పేదలుగానే ఉండాలని కోరుకునేవారు. వారిని పేదరికం నుంచి, బాధల నుంచి శాశ్వతంగా బయటకు తెచ్చే ఎలాంటి కార్య క్రమం చేపట్టేవారు కాదు. ఈమాట దక్షిణాసియాలో కాథలిక్ సేవా కార్యక్రమాల పర్యవేక్షకుడు లియో బెషామ్ (Leo Baysham) కూడా అన్నాడు. (The Guardian, 14, October, 1996) మీకున్న నిధులతో అలాంటి పనులు చేయవచ్చు కదా అంటే 'ఒంటరి ఆడదాన్ని నేనేం చేయగలను', 'ఒక్కరికి చేస్తే సరిపోతుందా? కొన్ని లక్షలమంది ఉన్నారు. వీరందరికీ చేయడం సాధ్యమేనా?' అని సమాధానం చెప్పేవారు. కానీ ఆవిడ ఏదో చేస్తోందనే భ్రమతో ఇక్కడికి విదేశీ వాలంటీర్లు వచ్చేవారు. వాళ్ళే అన్ని పనులు చేసిపెట్టేవారు. మరో వైపు పోప్‌తోపాటు అమెరికా సెనేటర్లు, ఐక్యరాజ్యసమితి, ప్రపంచఆరోగ్యసంస్థ ప్రముఖులు, అంతర్జాతీయ జర్నలిస్టులు థెరిసా సెంటర్లను సందర్శించి ఎంతో గొప్ప సేవ చేస్తోందని ప్రపంచానికి భ్రమ కల్పించారు. ఇలా ప్రపంచాన్ని ప్రచారపు మాయలో ముంచడమేకాక కోల్‌కతాను, అక్కడి ఇతర సేవా సంస్థలను తమ సేవా రాజకీయం కోసం వాడుకున్నారు థెరిసా. విదేశస్థుల మనస్సులు కరిగించడానికి, కోల్‌కతా ప్రజలు ప్రపంచంలోనే ఎంతో వెనకబడిపోయి ఉన్నారనిచూపించడానికి, అంత దీనస్థితిలో ఉన్నవారిని ఉద్ధరించడానికే తాను వచ్చానని చెప్పుకునేందుకు రకరకాల పద్ధతులు అనుసరించారు. అందులో భాగంగా మొదట కోల్‌కతా ప్రత్యక్ష నరకమని, దీనులు, దుఃఖితులతో నిండిపోయిన దారుణ మైన ప్రదేశమని ప్రపంచానికి చూపాలని ప్రయత్నించారు. ఇందుకు ఏకంగా 'సిటి ఆఫ్ జాయ్' (City of Joy) అనే డాక్యుమెంటరీనే తీయాలనుకున్నారు. డొమినిక్ లాపియర్ (Dominique Lapierre) అనే ఫ్రెంచ్ రచయిత డాక్యుమెంటరీకి స్క్రిప్ట్ తయారుచేశారు.

(ఇదే లాపియర్ భారత స్వాతంత్ర్యోద్యమం గురించి స్వాతంత్ర్యవీర సావర్కర్‌ను కించపరుస్తూ పుస్తకం రాశాడు. దాని గురించి ఇప్పటికీ మన మేధావులు గొప్పగా చెపుతుంటారు!) సిటి ఆఫ్ జాయ్ కోల్‌కతా నగరం దీనులు, రోగులు, పేదలతో నిండిపోయిందని, అలాంటివారి కష్టాలుతీర్చేందుకు నడయాడే సెయింట్ మదర్ థెరిసా అక్కడ అడుగుపెట్టిందని చిత్రీకరించారు. ఈ స్క్రిప్ట్‌ను స్వయంగా పోప్, మదర్ థెరిసాలు పరిశీలించి, తగిన సూచనలు, సలహాలు అందించారు కూడా. అలా కోల్‌కతా నగరం, భారతీ యులపై అతినీచమైన, హేయమైన దుష్ప్రచారం చేస్తూ, మరోవైపు థెరిసాకు ఏంజెల్, సెయింట్ హోదాను కల్పించడానికి ఉద్దేశించిన డాక్యుమెంటరీ తయారీకి హాలీవుడ్ ప్రముఖులు కూడా తమ వంతు సహాయసహకారాలు అందించారు.గాంధీ సినిమా తీసిన రిచర్డ్ అటెన్‌బరో ఈ డాక్యుమెంటరీకి దర్శకత్వంవహించడానికి సిద్ధపడ్డారు. కానీ ఆ తరువాత ఎందుకో మనసు మార్చుకున్నారు. విచిత్రమేమిటంటే కోల్‌కతా గురించి తీసిన సినిమాను అక్కడ కాకుండా శ్రీలంకలో సెట్స్ వేసి చిత్రీకరించారు! ఎందుకంటే కోల్‌కతా గురించి తాము చూపించ దలుచుకున్న నీచమైన, దారుణమైన పరిస్థితులు నిజానికి అక్కడలేవు. కనుక మరొకచోట షూటింగ్ జరిపి అది కోల్‌కతా అని పచ్చి అబద్ధాలు చెప్పారు. సిటీ ఆఫ్ జాయ్ స్క్రిప్ట్‌నే లాపియర్ పుస్తకంగా విడుదల చేశారు. కొన్ని యదార్థ సంఘటనలకు ఎన్నో కల్పిత పాత్రలు, సంఘటనల్ని జోడించి థెరిసాను సజీవ సెయింట్‌గా చిత్రించారు. ఇది కొన్ని లక్షల కాపీలు అమ్ముడుపోయింది. అలాంటి కల్పిత ఇమేజ్ సృష్టించడానికి లాపియర్ చెప్పని అబద్ధంలేదు, చేయని వక్రీకరణలేదు. ఆ అబద్ధపు, బూటకపు రచన గురించి చెప్పుకోవాలంటే ఒక గ్రంథం అవుతుంది. థెరిసాను సెయింట్‌గా నిలబెట్టడం కోసం కోల్‌కతాను దౌర్భాగ్యపు నగరంగా వర్ణించడమేకాక, నిజంగా సేవచేస్తున్న హిందూ సంస్థలపై బురదజల్లడానికి కూడా వెనుకాడలేదు. తమ మతరాజకీయాలకు అడ్డువస్తున్నాయనే కోపంతో రామకృష్ణమిషన్ వంటి సంస్థలపై దుష్ప్రచారం చేశారు. వరద బాధితులకు సేవ చేస్తామనే మిషతో రామకృష్ణమిషన్ సన్యాసులు పిల్లల్ని ఎత్తుకుపోయారని, సన్యాసులంతా పచ్చి తిరుగు బోతులని లాపియర్ తన పుస్తకంలో రాశాడు. (The city of Joy, Warner books, 1985, p.32, 498) అయితే చట్టపరంగా ఇబ్బందులు రాకుండా ఉండేందుకు తన రచనా నైపుణ్యాన్ని, భాషాపాటవాన్ని ప్రద ర్శించాడు. 'పిల్లల్ని ఎత్తుకుపోయేవారు రామకృష్ణమిషన్ సన్యాసులు వేసుకునే కాషాయ వస్త్రాలు ధరించారు' అని తెలివిగా రాశాడు. ఈ దుర్వ్యాఖ్యలకు

రామకృష్ణమిషన్ నిరసన తెలిపితే లాపియర్ వెంటనే క్షమాపణలు తెలిపాడు. అంతే కాదు తనకు రామకృష్ణపరమహంస, వివేకానందులంటే ఎంతో భక్తి అని, మిషన్ కార్యకలాపాలు ఎంతో గొప్పగా ఉంటాయని లేఖ రాశాడు. దానితోపాటు లక్షరూపాయల చెక్ కూడా పంపాడు. (అయితే ఆ చెక్‌ను రామకృష్ణమిషన్ తిప్పిపంపేసింది) ఇలా అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు పట్టుకోవడం మత ప్రచారకులకు మామూలే. అయితే వాటికన్ అనుమతితో లాపియర్ రామకృష్ణమిషన్‌పై చేసిన వ్యాఖ్యలు మాత్రం పుస్తకంలోనే ఉండిపోయాయి. ఇప్పటికీ ఆ పుస్తకం చదివినవారి మనస్సుల్ని కలుషితం చేస్తూనే ఉన్నాయి. ఇదీ థెరిసా, లాపియర్‌ల ద్వారా వాటికన్ సాగించిన విషప్రచారం.

ఒకపక్క తమ మతకార్యకలాపాలకు అడ్డువచ్చే సంస్థలపై బురద జల్లడంతోపాటు తాము చేస్తున్నామని చెప్పుకుంటున్న సేవను ఇతర సంస్థల ద్వారా చేయించుకోవడం థెరిసా ముఠా అనుసరించిన మరో పద్ధతి. కోల్‌కతాలోని మనోవికాస కేంద్రాన్ని ఇలాగే వాడుకున్నారు. తమ సెంటర్ల నుంచి రోగుల్ని ఇక్కడికి పంపేవారు. శిశుభవన్ నుంచి పిల్లల్ని కూడాఅక్కడికి తరలించేవారు. ఇందుకు మనోవికాస కేంద్రపు అంబులెన్స్‌లనే వాడుకునేవారు. (ఛారిటీ అంబులెన్స్‌లు నన్స్‌కి టాక్సీలుగా తప్ప మరెందుకూ ఉపయోగించేవారు కాదు) ఇన్ని సేవలు చేయించుకున్నా ఒక్క పైసా ఇచ్చేవారుకాదు.చిన్నపిల్లల కోసం పనిచేసే సంస్థనూ ఇలాగే వాడుకుంది మిషనరీస్ ఆఫ్ ఛారిటీ. బాధితులకు నిజంగా సేవ చేసింది ఈ సంస్థలైతే అలా సేవ చేస్తున్నామని కోట్ల డాలర్ల విదేశీ విరాళాలు దండుకున్నది మాత్రం థెరిసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ. ఇండియాలో సేవ చేస్తోందంటే ఒక్క థెరిసాయేనన్న ఇమేజ్ సృష్టించుకున్నారు. అలా అసలైన సేవా సంస్థలకు చేరవలసిన విరాళాలు కూడా తానే మింగేసేవారు.

ఇన్ని రకాలుగా పేదసాదల్ని అడ్డంపెట్టుకుని థెరిసా చేసినది సేవ అనాలో, వ్యాపారమనాలో, మతప్రచారమనాలో, మతరాజకీయాలు అనాలో, మోసం అనాలో లేక వీటన్నింటి మొత్తం అనాలో వివేకంగలవారు నిర్ణయించుకోవాలి.



డిసెంబరు, 1984. భోపాల్ యూనియన్ కార్బైడ్ కంపెనీ నుంచి వెలువడిన విషవాయువు వేలాది మందిని పొట్టన పెట్టుకుంది. ప్రపంచంలోనే అతిఘోరమైన పారిశ్రామిక ప్రమాదాల్లో ఒకటైన ఈ దుర్ఘటన బారిన పడ్డ ప్రజల్ని ఆదుకునేందుకు మదర్ థెరిసా అడుగు కూడా కదపలేదు. అప్పటికే నోబెల్ బహుమతి పొంది సేవా స్వరూపిణిగా అపారమైన కీర్తి మూటగట్టుకున్న థెరిసా ఒక అంతర్జాతీయ అతిథిలా భోపాల్‌ను సందర్శించారు. అక్కడ ప్రజలకు వచ్చిన కష్టం తెలుసుకున్న తరువాత ఒకే ఒక మాట చెప్పారు – క్షమించండి. చుట్టూ ఉన్న వరంతా నిర్ఘాంతపోయారు.

సెప్టెంబరు 30, 1993.. మహారాష్ట్రలోని లాతూర్‌లో భయంకరమైన భూకంపం వచ్చి ఎనిమిది వేలమంది చనిపోయారు. లక్షల మంది ఇళ్ళువాకిళ్ళు కోల్పోయారు. రామకృష్ణ మిషన్ వంటి రెండువందల స్వచ్ఛంద సంస్థలు కొన్నేళ్ళ పాటు సహాయ కార్యక్రమాలు నిర్వహించాయి. బాధితుల్ని ఆదుకునేందుకు మదర్ థెరిసా సంస్థ మిషనరీస్ ఆఫ్ చారిటీ మాత్రం ముందుకు రాలేదు.

సెప్టెంబర్, 1995.. కోల్‌కతాకు చుట్టుప్రక్కల అనేక ప్రాంతాలకు వరదలు ముంచెత్తాయి. వందలాదిమంది చనిపోయారు. వేలాది మంది ఇళ్ళువాకిళ్ళు కోల్పోయారు. బాధితులకు సహాయం చేయడం కోసం అనేక స్వచ్ఛంద సంస్థలు ముందుకు వచ్చాయి. సహాయ కార్యక్రమాలు ఆరునెలలపాటు సాగుతూనే ఉన్నాయి. వరద బాధితుల కోసం కోల్‌కతాలో సెక్స్‌వర్కర్లు కూడా విరాళాలు సేకరించారు. కానీ మదర్ థెరిసా మిషనరీస్ ఆఫ్ ఛారిటీ మాత్రం సహాయ కార్యక్రమాలకు దూరంగానే ఉండిపోయింది.